GRIHALAKSHMI

# గృహలక్ష్మి

స్త్రీల ఆరోగ్యసౌభాగ్యములను పెంపొందించుట
కేర్పడిన సచిత్ర మాస పత్రిక

సంపాదకుడు :

డాక్టరు కే. యస్. కేసరి

సంపుటము ౧౨] మార్చి 1949 [సంచిక 3




### సాలుచందా మొదలగునవి

ఈ సచిత్రమాసపత్రిక సాలుచందా **రు.4-8-0.** అర్ధసంవత్సరపు చందా **రు.2-8-0.** అంతకు తక్కువ కాలపరిమితి చందా పద్ధతిలేదు. విడికాపి ఆరు అణాలు. చందాదారులు ఏమాసమునుండియైన ప్రారంభము చేయవచ్చును. విడికాపీలు వలయువారు వాని విలువమేరకు తపాలాబిళ్లలు పంపవలయును. వీ. పీ. పద్ధతి వ్యయమూలకము. బర్మాకు రేట్లు ప్రత్యేకము.

### ప్రకటనలు

ముఖ్యముగా స్త్రీలకందీయవలసిన వస్తువులనుగూర్చి ప్రకటించుటకీపత్రిక ఎంతయు అనువైనది. ప్రకటన చార్జీలు ప్రతిమాసము ముందుగానే చెల్లింపవలయును. కాలుపుటకు తక్కువయైన ప్రకటనలు చేకొనజాలము. రేట్లకొఱకు వ్రాయునది.

### వ్యాసములు వ్రాయువారికి

వ్యాసముల ముఖ్యాశయము స్త్రీజనాభ్యుదయమైయుండవలెను. అవి సంగ్రహముగ నున్న శీఘ్ర ప్రచురణకు వీలగును. ఒకేప్రక్క సిరాతో స్పష్టముగ తప్పులులేక వ్రాయవలెను. భాష గ్రాంధికముగాని, వ్యావహారికముగాని కావచ్చును; రెండును కలిపి వ్రాసిన అంగీకరింపబడవు. వ్యాసముల ప్రకటించుటలో సంపాదకులకు సర్వహక్కులు గలవు. ప్రకటింప నంగీకరింపబడినపుడు మాత్రము రచయితల కట్లు తెలుపబడును. విమర్శనార్థము పంపు గ్రంథములు రెండుప్రతులు పంపవలెను. రిప్లైకార్డు వ్రాసిననే బదులివ్వబడును.

### సంచికలు చేరనిచో

సంచికలు చేరనిచో ఆయామాసములందు వెంటనే మాకు తెలుపవలయును. చిరునామామార్పును తెలుపకుండుటచే కాపీలు చేరనివారికి తిరుగ పంపజాలము. సంచికలు చేరనివారు తమతమ పోస్టాఫీసులలో కంప్లైంటును చేయునది.

### చిరునామా మార్పు

చిరునామాయందు మార్పుఉండుచో ముందుగానే తెలుపవలయును. ఇట్లు తెలుపనిచో కాపీలు తిరుగ పంపజాలము.

### ముఖ్యమైన గమనింపు

చందాదారులుగ చేర్చుకొనుమని వ్రాయు ఉత్తరములు, ఇతరమైన ఉత్తరములు మానేజరు, గృహలక్ష్మి, రాయపేట, మదరాసు అను చిరునామాకే వ్రాయవలయును. చెక్కులు,మనియార్డర్లు, పోస్టలు ఆర్డర్లు 'కేసరికుటీరం లిమిటెడ్' పేర పంపవలెను.

చెక్కులు మద్రాసు బ్యాంకులపైననే పంపవలెను.

# గృహలక్ష్మి ఏజంట్లు:

—(★)—

గుంటూరు: వెల్కం & కో.
చిత్తూరు. వి. చెన్నకేశవులు నాయుడు.
కర్నూలు: బాలసరస్వతి బుక్ డిపో.
బెజవాడ: మాడర్న న్యూసు ఏజన్సి.
కాకినాడ: వి. సూర్యనారాయణ
అనంతపురము: వై. సాంబశుం.
భద్రాచలం: టి. వి. జి. ఆర్. మూర్తి.
దొమ్మగూడెం: సి. హెచ్. బాపనయ్య.
నర్సాపూరు: వై. సుందరరామయ్య.
కావలి: జి. రంగయ్య.
మారుటేరు: వి. వి. సుబ్బారావు.
గుడివాడ: యం. రామమూర్తి పంట్.
పిఠాపురము: యం. సూరరాజు.
కళ్యాణదుర్గం: కె. మల్లప్ప.
నిడదవోలు: కె. సి. సి. అయ్యర్.
మచిలీపట్నము: టి. బి. నారాయణసింగ్.
ఏలూరు: నేషనలు బుక్కుడిపో.
రాజమండ్రి: నేషనల్ ఏజన్సీస్.
తుని: కోడూరు సూరరాజు.
బరంపురం : కె.వి.రంగారావు.
విశాఖపట్నం: కె. సుందరేశ్వరరావు.
కనిగిరి: కె. యస్. శాస్త్రి
పర్లాకిమిడి: బి. యన్. మూర్తి.
ఇచ్ఛాపురం: కె. గంగయ్య
బళ్ళారి: యస్. గురునాథ్
అనకాపల్లి: పి. వీరునాయుడు.
విజయనగరము : పి. నారాయణప్పడు.

ఆకీడు: వి. లక్ష్మీనారాయణ
భీమవరం: యన్. సూర్యనారాయణ.
పొన్నూరు: చౌదరి ఖాదీస్టోర్సు
మదనపల్లి: యన్. రాధాకృష్ణయ్య
అంబాజీపేట: పి. రామమూర్తి.
చికాకోలు: బి. యన్. మూర్తి.
వసంతవాడ: యస్. కె. శర్మ.
ఖర్గపూరు: యస్. వి. నాయుడు.
పార్వతీపురము: ఎ. వి. పి. యన్. మూర్తి.
తిమ్మనచర్ల: రాయలసీమ న్యూసుమార్టు.
వాల్తేరు: సిటి న్యూస్ ఏజన్సి.
చల్లపల్లి: బి. ఆంజనేయులు.
జగత్యాల: కాసం, శివరాజగుప్త & సన్సు.
రంగూన్: నేషనలు స్టోర్సు.
ఎలమంచిలి: కె దేముళ్ళు.
బాపట్ల: యల్. వి. మనోహరరావు.
నర్సీపట్నము: సి. రామం.
జంషెడ్పూర్: యం. శ్రీరాములు.
తాడేపల్లిగూడెం: జి. సూర్యరావు.
మహబూబ్ నగర్ : ముత్యాలు & సన్సు.
వేలూరు: ఎ. వెంకటశాస్త్రి గారు.
హైదరాబాద్ : నవ్యాంధ్రా ఏజన్సీస్.
కదిరి: జి. సి. కోదండరామయ్య.
గోకవరం: వి. వి గోపాల్ రావు.
పామర్రు: జి. లక్ష్మయ్య.
ఛత్రపురం: వి. వి. రంగాచారి
డోర్నకల్లు : కె. జె. జి. సుందరం.
చోడవరం : పి. విశ్వేశ్వరరావు.

**హిగిన్ బాతమ్ స్టాలుల వద్ద దొరకును.**

 ఇతరచోట్లను ఏజంట్లు కావలయును; డిపాజిటుతో దరఖాస్తుపంపుకొనుడు.

# విషయసూచిక

—:o:—



స్వర్ణకంకణ గృహీత శ్రీమతి నాగరత్నముగారును, అధ్యక్షులుగారు గిడుగు లక్ష్మీకాంతమ్మగారును
మధ్యనుండగా తీయబడిన ఛాయాచిత్రము



శ్రీ కేసరిగారు శ్రీమతి నాగరత్నంగారికి కనకకంకణము సమర్పించుట




జయజయ గృహలక్ష్మి సఖి! జయజయ లలితాంధ్ర మధుర సారస్వతిమా!
జయజయ లలనా రత్నమ! జయజయ విద్యాప్రబోధ! జయ కల్యాణీ!

---

# గృహలక్ష్మి స్వర్ణకంకణ ప్రదానోత్సవము

—:♦:—

ఈ సంవత్సరమున్నూ, యథారీతిగానే గృహలక్ష్మి స్వర్ణకంకణ ప్రదానోత్సవము జయప్రదంగా జరిగినందుకు సంతోషిస్తున్నాము. మాతోపాటు మా పాఠకులున్నా సంతోషిస్తారని ఆశిస్తున్నాము.

ఈసారి కంకణ గృహీతలైన విద్యాసుందరి గానకళావిశారద శ్రీమతి బెంగుళూరి నాగరత్నంగారికి కంకణప్రదానంతోపాటు, చెన్నపురి మహిళామణులు శ్రీశ్రీశ్రీ విజయనగరం మహారాణీసాహెబా విద్యావతీదేవీ పురస్కృతులై "త్యాగసేవాసక్త" అనే బిరుదు నివ్వడంకూడా సమంజసం.

శ్రీమతి నాగరత్నమ్మగారి జీవితచరిత్రలో ముఖ్యంగా గృహలక్ష్ములకు కావ్యాయమైనవి, ఆదర్శప్రాయమైనవి రెండుమూడు వాంశాలున్నవి.

శ్రీ నాగరత్నంగారి తల్లి పుట్టలక్ష్మమ్మగారు అన్యథావర్తించడానికి అవకాశాలూ, ఆచారాలూ, వయోరూపాలూ అనుకూలంగా ఉన్నా, తన సుఖసౌఖ్యాలను త్యాగంచేసి తనకూతురు నాగరత్నంగారి ఉత్తమమైన భవిష్యజ్జీవితానికి పునాదివేశారు.

శ్రీమతి నాగరత్నంగారును తల్లి కోరికమేరకు విద్యాబుద్ధులు, నేర్చి, ఆమెవేసిన పునాదులపై ప్రభుపండితసమ్మాన్యమైన తన జీవితసౌధాన్ని అద్భుతంగా నిర్మించుకొన్నారు.

అయితే ఆమె దివ్యమైన తన జీవితసౌధోపరిభాగాన ముఖమంటపముపై — "భోగ భాగ్య విలాస నిలయం" అని గర్వంతో వ్రాయించుకోలేదు; "త్యాగ భక్తి వైరాగ్య నిలయం" అని వినయంతో వ్రాయించుకున్నది.

అందుచేతనే ఆమె పండితునిచే "విద్యాసుందరి" అనిపించుకున్నది. కళాప్రపూర్ణ కవిసార్వభౌమునిచే "గానకళావిశారద" అనిపించుకున్నది. నేడు "గృహలక్ష్మి స్వర్ణకంకణము" ధరించి శ్రీశ్రీశ్రీ విజయనగరం మహారాణీసాహేబా విద్యావతీదేవిత్యాది చెన్నపురి మహిళామణులచే దత్తమైన "త్యాగసేవాసక్త" అన్న బిరుదుకూడా వహించినది.

ఇన్నిట ఎన్నికగన్నా, గర్వమును కాలదన్ని, వినయవినమితోత్తమాంగియై ఆంధ్ర నారీమణులను, ఉత్తమతనయలై, ఉత్తమ గృహలక్ష్ములై, ఆదర్శమాతలై శీల సత్ప్రవర్తనములు గల్గి, సాధించిన స్వరాజ్యమును నిర్మించుకొనుడు—అని ఆశీర్వదించినది.—తథాస్తు.

———



# "త్యాగ సేవాసక్త"

## విద్యాసుందరి గానకళా విశారద

## శ్రీమతి బెంగుళూరి నాగరత్నముగారి జీవిత చారిత్రము

గత శతాబ్ద మధ్యమున మైసూరు సంస్థానమున 'సుబ్బన్న' యని యొక సంపన్న గృహస్థుడుండెను. ఆయనకు భోగినీకుల సంజాతయందు శ్రీమతి పుట్ట లక్ష్మమ్మ గారు జన్మించిరి. ఆ యువతి ఉచిత వయస్సున తమ కులాచారానుసారము శ్రీ యం. సుబ్బారావుగారను యొక వైశికుని ప్రేయసియాయెను. ఆయన మైసూరునందు సుప్రసిద్ధ న్యాయవాది; బ్రాహ్మణుడు. వారికి అచిర కాలముననే యొక ఆడుబిడ్డ కల్గినది. ఆమెకా తల్లి — 'నాగరత్నము' అని పేరు పెట్టెను.

ఈమె జననకాలమును జాతక చక్రమును ఈ క్రిందనిచ్చుచున్నాము. జ్యోతిషశాస్త్ర ప్రవేశముకల వారరయుదురుగాక.

| | | | |
|---|---|---|---|
| | | | |
| శ చం | రాశి | | కే |
| గు రా | (సవ్య) | | |
| ల | | బు, ర<br>కు, శు | • |

(1878) బహుధాన్య కార్తీక శుద్ధ నవమిరవివారం సూర్యోదయ సమయము జననము ధనిష్ట 3 వ పాదం

నాగకన్యలు సంగీతక విద్యానిపుణులు; రత్నము ప్రకాశ యానము. కావున శ్రీమతి పుట్ట లక్ష్మమ్మ గారు తన తొలిచూలి శిశువునకాపేరు పెట్టుకొనుటలో ఆమె భవిష్యత్తును గూర్చి ఎట్టి మధురస్వప్నముల

గాంచినదో! మాతృహృదయము క్షీరసాగర తుల్యము. అందమృతము, లక్ష్మి, కల్పవృక్షము, కామధేనువు, చంద్రుడు, అప్సరసలు ఇత్యాదు లుద్భవమగును.

శ్రీమతి పుట్టలక్ష్మమ్మగారిది ఉదాత్తమైనప్రకృతి. ప్రాచీన కులధర్మాదులందు ఆమెకు నైజముగనే ఆసక్తిమెండు. సకలశాస్త్రకళాపారంగతులైన విద్యావంతులై, ఏకచారిణీవ్రతపరాయణలై, ఉన్నతపథమున జీవితమునడుపుట తమకులధర్మమని ఆమెకు సహజముగ నేతోచినది. కాని నాటి లోకవాడుకననుసరించి ఆమె ధనసంపాదనాసాధన మొనర్చుటలేదని ఆమెను పెంచి పెద్దచేసినవారికి కంటకమైనది. వారామెకు శ్రీ సుబ్బారావుగారి ఆశ్రయమును తప్పించిరి. కాని ఆమె కోరకరాని కోయ్యముక్కఆయెను. ఆ పోషకులుకోపించి పిల్లనుతల్లిని నిలువుదోపుగావించి చింకపేలికలతో వీధిలోనికి నడిపించిరి.

నిండు జవ్వనమున నిరుపేదయైయున్న పుట్టలక్ష్మమ్మగారు అప్పుడేమి చేయదగును? అవ్యక్త మధురముగా తన చేతులలో కిలకిల నవ్వుచున్న బిడ్డ ముఖారవిందము చూచినది. ఆమెకేమితోచెనో? తన్ను మరచినది; తన శిశువును ఉత్తమ విద్యావంతురాలి నొనర్చి, తనకు పట్టిన కర్మము పట్టకుండ సర్వతంత్ర స్వతంత్రగా, పిదప జీవితము నడుపగల ధీరస్వాంత నొనర్పవలయునని ఆ మాతృదేవత నిజహృదయమున దృఢసంకల్ప మొనర్చుకొన్నది. అందుకనుగుణ్యముగా — మైసూరు వాసులగు సంగీత సాహిత్య కవితా విశారద ఆస్థాన విద్వాన్ గిరిభట్ట తమ్మయ్య శాస్త్రిగారి నాశ్రయించినది. ఆయన నామె అగ్రహారములుగాని, ఖండ్రికలుగాని, ధనరాసులుగాని కోరలేదు. తన శిశువునకు విద్యాదాన మొనర్పుమని ప్రార్థించినది. ఆ శాస్త్రిగారు కడుదయార్ద్ర హృదయులు. ఆ మాతృ హృదయావేదనమును గ్రహించినారు. ఆయన బహుకుటుంబి. శ్రీమతి పుట్టలక్ష్మమ్మతో "నీకు పంచులు క్షమ్మరింప జాలనుగాని యథోచితముగ అన్న వస్త్రములకు గడుపుచు, నీ బిడ్డను మాత్రము శాయశక్తుల విద్యావతి నొనర్తు"నని వాగ్దత్త మొనర్చినారు.

శ్రీమతి నాగరత్నముగారు శిశువుగా జిలిబిలి పలుకులు పలుక నేర్చినవెంటనే శాస్త్రిగారామెకు విద్యాభ్యాసమొనర్చిరి. ఆమెకు 9 సం॥ల వయస్సు వచ్చునాటికే త్రికాండముల అమరము నోటికివచ్చినది. ఇతరసాహిత్యములందు ప్రవేశము కల్గినది. మాతృభాషయగు కన్నడము, సంగీతభాష తెలుగు, రాజభాష ఆంగ్లము—ఇన్నిట ప్రవేశము కల్గినది. శ్రీ శాస్త్రిగారివల్లను వారి శిష్యులగు బిడారం కృష్ణప్పగారివల్లను సంగీతశాస్త్రమున, స్వరములు, 'ఆ' కార 'ఈ' కార సాధనము అలవడినవి.

అయితే సరస్వతీదేవి శ్రీమతి పుట్ట లక్ష్మమ్మ సంకల్పబలమెట్టిదో పరీక్షింపదలచెను కాబోలు! శ్రీ సుబ్బారావుగారి ఆశ్రయము విడిచిన శ్రీమతి పుట్ట లక్ష్మమ్మకు శాస్త్రిగారి పంచన తలదాచుకొన నవకాశమొదవుటయు, ఆమెశిశువు చంద్రరేఖవలె దినదిన కళాభివృద్ధినందుచుండుటయు చూడగా కులము వారికి కన్నుకుట్టినది. లేనిపోని తంపులుపెట్టి వెన్నవంటి తమ్మయ్యశాస్త్రిగారి మనస్సును పాషాణమొనర్చిరి. శ్రీ శాస్త్రిగారు ఆగ్రహాతిరేకమున "నీ బిడ్డ మైసూరున పేడకడు లెత్తును పో!" అని శపించిపల్కుచు ఆమాతాశిశువులను వీధిలోనికంపిరి. శ్రీమతి పుట్ట లక్ష్మమ్మ తాము తిరిగీ నిరాధారులైనందుల కంతగా వగవలేదు. నైజముగా మృదుభాషణులగు శ్రీ శాస్త్రిగారి దూషణవాక్యములకు ఆమెకు ఎక్కడలేని రోషము వచ్చినది.

"మాతృత్వమును వివరింపజాలము. ఆ మాతృత్వముతో నీవు తర్కింపజాలవు. అదియే మాతృమూర్తికి ఉత్కృష్టత కలుగజేయునది. ఆమె తర్కమున కందదు. అప్పుడు తల్లి ఇంకేమాత్రము స్త్రీగాదు. ఆమె ఆడుపులి; ఆమె బిడ్డలు పులి

పిల్లలు. కావున మాతృత్వమున, తర్కవితర్కముల కతీతమై, ఏకకాలముననే స్వాన మును, ఆధిక్యమునైన విభూతియొక్కటి అంతర్భూతమైయున్నది. తల్లికి అమోఘ మైన సహజజ్ఞాన మొకటియుండును. అపారమును అవాఙ్మానసగోచరమునగు ఈశ్వ రేచ్ఛ ఆమెయందే అంతర్వాహినియైయుండి ఆమెకు దారిచూపును. దైవకటాక్షమున వెల్లుగాంచుచున్న అంశత్వ మది.......... . ఒకసుస్థిర సంకల్పము వెర్రిగానైన పరిణమించును లేదా వీరోత్సాహముగనైన పరిణమించును."

ఇట్టి ఉత్తమవాక్యములతో మాతృత్వ విశేషమును పరాసుకవీంద్రుడు విక్టర్ హ్యూగో వర్ణించి యున్నాడు.

శ్రీమతి పుట్ట లక్ష్మమ్మగారి స్థితి సరిగా ఇప్పుడట్టిది.

ముప్పది సం॥లు నిండియు నిండని లేబ్రాయపు జవరాలు పుట్ట లక్ష్మమ్మగారు. 9 సం॥ల బాలిక వేలు పట్టుకొని వీధిలోనికి నడచుచు, తన్ను తనకూతురును తిరస్కరించి, తుస్కరించి, దూలపల్కు శాస్త్రిని శోకకషాయితనేత్రియై గాంచి ఇట్లు పల్కినదామె: "నా బిడ్డ ఏ చేతులతో పేడకడు లెత్తునని పల్కుచున్నారో, ఆ చేతులకే, తన సంగీతసాహిత్య విద్యాచాతుర్యమునకై ఇచ్చటనే బంగారు తోడాలు తొడిగించుకొనజాలదేని—తిరిగీ మేమీ మైసూరు రాజ్యమున అడుగు బెట్టము. అట్టి చాతుర్యము నా కూతురున కలవడదేని మేమీభూమిపై బ్రతికియుండము. ఆత్మహత్యగావించుకొందుము".

శ్రీ శాస్త్రిగారి గృహము విడిచినదిమొదలు—తన శపథము నెరవేర్చుటకే శ్రీమతి పుట్ట లక్ష్మమ్మ గారు కృషిచేసిరి. మున్ముందు కాంచీపురమునకు వచ్చిరి. అచ్చట శ్రీమతి ధనకోటి అమ్మాళ్ సుప్రసిద్ధగా యకశిరోమణియై వెలయుచుండెను. ఆమె దరిచేరి తనకుమార్తెకు విద్యాదానమొనర్చుమని శ్రీ పుట్ట లక్ష్మమ్మ కోరెను. ఇంత చిన్ని బాలికను సంగీతశాస్త్రమున శిక్షించుట తనకు సాధ్యముకాదని ఆమె చెప్పి, అయినను శ్రీరంగములోనున్న యొక అధ్యాపకుని కుదుర్తు ననెను.

కాని ఆమాటలతో శ్రీ పుట్ట లక్ష్మమ్మగారికి తృప్తికలుగలేదు. వెంటనే బెంగుళూరునకు వెళ్లి అక్కడ శ్రీ దేశికాచార్యుల దయవల్ల మునిస్వామియప్ప అను సంగీత శాస్త్రాధ్యాపకుల పరిచయము సంపాదించెను శ్రీ మునిస్వామియప్పయు భోగినీకులస్థుడే. నాటి రోజులలో వారు ఫిడేలువాయిద్యమున చాల ఘనులు; గాత్రము నేర్పుటలో మిక్కిలి సమర్థులు. అంతేకాదు. శ్రీ వాలాజాపేట పట్టునూలు కృష్ణస్వామి భాగవతులవారు శ్రీ త్యాగరాజువారి ప్రత్యక్ష శిష్యులు. ఆ కృష్ణస్వామి భాగవతులవారి శిష్యులు శ్రీ మునిస్వామియప్పగారు. అట్టివారిని శ్రీ పుట్ట లక్ష్మమ్మ ఆశ్రయించి—తన 9 సం॥ల బాలికకు సంగీతము నేర్పుమని వేడుకొనెను. శ్రీ పుట్ట లక్ష్మమ్మ ఆర్తి నాయనగ్రహించినారు. ఆమెయందు సోదరీప్రేమ యుదయింప మునిస్వామియప్ప శ్రీమతి నాగరత్నముగారిని శిష్యురాలినిగా అంగీకరించెను.

కర్ణాటక సంగీతమున విశేషముగ తెలుగు వాడుక భాషయైనది. కాని విద్వాంసులు పలువురే తమిళులు. కర్ణాటక సంగీతమునకు తమిళదేశమున ఆదరము మెండు. అందుచే తమిళము నేర్పించుటకొక ఉపాధ్యాయు నేర్పరచినది. ఆంధ్రగీర్వాణహ్యాణ భాష లదివరకునుండియు నేర్పించుచుండెను గదా.

సంగీతమనగా కేవలము గీతాలాపన రూపకమగు గానమే కాదు. "గీతం వాద్యం నర్తనంచ త్రయం సంగీత ముచ్యతే" అని సంగీతదర్పణమున చెప్పబడియున్నది. "గీతం వాద్యం తథా నృత్యం త్రయం సంగీత ముచ్యతే" అన్నాడు సారంగదేవుడు తన సంగీతరత్నాకరమున. భరతశాస్త్రము నాట్యం, నృత్యం,

నృత్తం - అని త్రివిధము.(నాట్యమ్, నృత్యమ్, తథానృత్తం త్రిధా తదితి కీర్తితం॥ సంగీతరత్నాకరం.) కావున శ్రీ పుట్టలక్ష్మమ్మ తన కుమార్తెను సంపూర్ణమగు సంగీత సాహిత్య విద్యాసుందరిని గావింపదలచినది. మద్రాసు తిరువెంకటాచార్యులవద్ద అభినయమును, బెంగుళూరి కిట్టన్నవద్ద నృత్యశాస్త్రమును నేర్పించినది. ఇందుకై మూసవారీగా కొంత శలవు చేయవలసి వచ్చెను. పదిపండ్రెండుసంవత్సరములబాలికకు - ఇన్నివిద్దెల నూరిపోయించిన శ్రీమతి పుట్టలక్ష్మమ్మకెంతటి విద్యాదాహము! తమ ఆకలికోలది బిడ్డలకాహారమిడుట తల్లులకు నైజమే. కాని తల్లికిగల విద్యాదాహముమేరకు కుమార్తె శ్రద్ధతో నాయావిద్యలనేర్చుటయు నిక్కడ విశేషము. బహుశా, అది తల్లిప్రోత్సాహమే గాక జననాంతర సంస్కారమును అయియుండవలెను.

తనకుమార్తె ఉరవడిగా విద్యావతిగావలయుననే ఆత్రమున శ్రీ పుట్టలక్ష్మమ్మ - నైజముగా తల్లులు ఆడుబిడ్డలయందుచూపు అతి గారాబమును మరుగుపరచి శ్రీ నాగరత్నముగారిని కఠినశిక్షణమున పెంచినది. పాపము - అప్పుడప్పుడు దండతాడనములను తల్లివల్ల శ్రీ నాగరత్నముగారు చవిచూచిరట. కులస్త్రీలు తమ ఆడుబిడ్డలకు వయసు వచ్చుసరికి పెండ్లిచూపులకని ఎంతో గోము చేయుదురు. కాని శ్రీ పుట్టలక్ష్మమ్మ తన పుత్రికకు యౌవనావిర్భావమగుచున్నను అట్టిగోమేమియు చేయలేదు. ఆమెను విద్యావతినొనర్ప వలయుననే ఏకైకవాంఛయే ఆతల్లి మనోవాక్కర్మముల నిండి నిబిడీకృతమైయుండెను.

తనకుమార్తెవిద్య ఇట్లు దినదినాభివృద్ధి నందుచుండగా శ్రీ పుట్టలక్ష్మమ్మ ఆరోగ్యము దినదినము క్షీణింప నారంభించినది. క్షయవ్యాధి అంకురించినది. అవసానదశ సమీపించినది. శ్రీ మునిస్వామియప్పను దగ్గరకుపిలిచి తాను మైసూరు శాస్త్రిగారివద్దచేసిన శపథము నుదహరించి, దానినిపూరించు భారము మీది యని - శ్రీ నాగరత్నముగారిని వారికప్పజెప్పెను. శ్రీమతి నాగరత్నముగారి కప్పుడు **13, 14** సం॥ల ప్రాయము. తల్లి తనసకలాశయములు కేంద్రీకరణమైయున్న ఆ చిన్నకుమార్తెను చేరంజీరి - అశ్రుధారలొలుక, గద్గదస్వరమున నిట్లనెను:

"బిడ్డా! నీకు నేను ధనరాసులు ప్రోగుచేసిపెట్టలేదు. వానిని దొంగలు దోచుకొనిపోగలరు. అన్యాక్రాంతము కాజాలని విద్యాధనమునే నీకు చేకూర్చుటకై నే నిన్నాళ్లును పాటుపడితిని. అదియే మన కుల ధర్మమునందలి ముఖ్యలక్ష్యము. అభ్యుదయ పరంపరాభివృద్ధికల్గి చిరంజీవివైయుండుము."

ఈదృశ్యమును శ్రీ పుట్టలక్ష్మమ్మ మరణశయ్యాప్రక్కన నుండి గాంచుచున్న మునిస్వామియప్పకు గుండె నీరయ్యెను. మరణింపనున్న ఆ మాతృమూర్తి నిశ్చింతతో అసువుల విడుచుట ధర్మమని ఆయన తలంచెను. ఆయన వారికేమియు కాడు; సాటికులమువాడు. రు **10/-**ల మాసవేతనమునకు చదువుచెప్పుచున్న ఉపాధ్యాయుడు. కాని ఆ దివ్యసమయమున ఆయనయందు దైవాంశ సముత్పన్నమైనది. అప్పుడాయన ఆ యమ్మతో నిట్లన్నాడు: "తల్లీ! అన్ని దిగుళ్లు విడిచిపెట్టుము. ఈ ప్రాణ ప్రయాణసమయమున శ్రీ రామచంద్రమూర్తి పాదారవిందములయందు మనస్సు పదిలపరచుకొమ్మా. మీ శపథమును నేను తప్పక నెరవేర్తును. మీరాశుభదృశ్యమును వైకుంఠధామమునుండి తప్పక తిలకింతురు. కావున నిశ్చింతతో శ్రీరామచంద్రప్రభు నాశ్రయించి ముక్తిగాంచుడు." శ్రీ మునిస్వామియప్ప పల్కులయందును, తన తనయ సామర్థ్యమునందును నమ్మకముంచి - శ్రీమతి పుట్టలక్ష్మమ్మ ఇహలోకమును వీడినది.

ఇప్పుడు - శ్రీమతి నాగరత్నముగారు - ఈలోకమున వంటరి - కాదు - ఈలోకమునగల నీరంతయు సారాయముకాలేదేమని నిత్యము అంగలార్చు మేనమామయొకడు తనయింటనున్నాడు. పిదపకాలమున శ్రీ పుట్టలక్ష్మమ్మ కాశ్రయమిచ్చిన క్షత్రియోత్తమునకు - రూపసుందరియు, విద్యాసుందరియునైన శ్రీమతి నాగరత్నముగారియందు మనస్సుభ్రమింపనారంభించెను. ఈ రెండుగ్రహములదృష్టియు నామె ఉచ్ఛస్థితికాటంకములనిగ్రహించి వారి బారినుండి ఆమెనుతప్పించి - మునిస్వామియప్ప వాత్సల్యాతిశయమున ఆమెను

కంటికి రెప్పవలె కాపాడుచు - ఆమెను విద్యాప్రాగల్భ్యమేర్పడ దీక్షతో కృషిచేయసాగెను. ఆయన ఆదరణమున ఆమె 16, 17 సం॥ లు వచ్చునప్పటికి చిన్న చిన్నపాటకచ్చేరీలొనర్చి గొప్పవారిని మెప్పింపసాగెను.

ఆపిదప మాతృదేవి శపథానుసారము - మైసూరు మహారాజాస్థానమున తనకుజరిగిన బహూకరణ విషయమునామెయే ఇట్లొకచో (1946 లో) వ్రాశియున్నది:

మైసూరు మహారాజాగారు, యిప్పుడు పరిపాలించు శ్రీ జయచామరాజ వుడయర్ గారి తాతగారు, చామరాజవుడైరుగారు ఆహ్వానమిచ్చి దర్బారుహాలులో సంస్థానవిద్వద్గాయక వైణికబృందములు కూడి యుండు సభలో నా పాటలు జరిగించి శిల్లత్తులు అనగా గొప్పవస్త్రములు మొదలగు బహుమానములు దయచేయించిరి. శ్రీచామరాజేంద్ర వుడయర్ స్వతహాపాడెదరు. తమసంస్థానమున జన్మించినదాననను స్వాతంత్ర్యమువలన మైసూరులో రాజాస్థానమున నివసించుభాగ్యము బ్బెను.

అసభలో శ్రీ తమ్మయ్యశాస్త్రిగారును ఉండిరని వేరుగచెప్పవలెనా? "అన్ని పరీక్షలకాగి తిరిగి రాజ్యపదమునందిన సత్యహరిశ్చంద్రునివలె మెరయుచున్నావు. ఇంతకుమూలమైన విశ్వామిత్రునివలె నిన్ను మెచ్చి సంతోషించుచున్నాను. ఈ ఆనందసమయమున వశిష్ఠునివలె సంతోషించుటకు మీయమ్మ పుట్టలక్ష్మమ్మ లేదుగదా-" ఇత్యాది వాక్యపరంపరల నుప్పించుచు పరమానందాతిశయమున వాత్సల్యముతో, - ఆపండితుండు, నిండుసభలో శ్రీ నాగరత్నముగారిని కౌగలించుకొని - ఆశీర్వదించెను. ఇందుకైయ్యే వేచియున్నాడా యన్నట్లు - శ్రీ మునిస్వామియప్పగారు - పిదప కొద్దికాలముననే హఠాత్తుగా విగతజీవుండాయెను.

ఇదియు శ్రీ నాగరత్నముగారి జీవితమున నొక విలక్షణమగు ఘట్టము. రాజాశ్రయమున కీర్తి ధనము లేర్పడినవి. కాని మునిస్వామియప్ప చావుతో ధనము అన్యత్ర చిక్కుపడ్డది. సకలజనాకర్షణీయమగు నవయౌవన సౌందర్యములున్నవి. రసికజన హృదయానందకరమగు సంగీతకాది లలితకళలమరియున్నవి. స్వాతంత్ర్యముగల కులమని లోకాచారమొక్కటి పెనుపామై యున్నది. తన్ను వక్రమార్గములబడకుండ కాపాడగల తల్లిగాని, తన బాగోగులను రక్షింపగల మునిస్వామియప్పగాని లేరు. తల్లి దయతో నేర్పింపగా తా నేర్చిన విద్యాబుద్ధులే చేటికలుగా ఏకాంతవాస మొనర్చుచున్నది. ఆమెచేటికలే ఆమెను రక్షించినవి.

ఆమె విద్యావినయ సౌశీల్యములకు ముగ్ధులై మైసూరురాజాస్థానమునందలి గొప్పగొప్పఅధికారులు తరచు ఆమెచే కచ్చేరీలు చేయించుచూ సత్కరింపసాగిరి. క్రమముగా మైసూరుసంస్థానమంతయు ఆమెకీర్తి వ్యాపించినది. శ్రీ సి. యస్. రాజరత్నం మొదలియారుగారి ఆదరణమున ఆమెకీర్తిలత మద్రాసునకును వ్యాపించినది.

ఆమె 25 సం॥ లు వచ్చువరకు బెంగుళూరునందేయుండెను. అప్పుడప్పుడు మద్రాసునకు వచ్చి పోవుచుండెను. పిదప మద్రాసులోనే శ్రీనివాసయ్యర్ వీధిలో స్వంతముగ నొక ఇంటినికొని అందునివసించుచు చెన్నపురినివాసురాలైనది. కాని తొలుత బెంగుళూరినివాసమువల్ల ఏర్పడిన 'బెంగుళూరు' అనుగృహనామమట్లేయున్నది. విద్య ఆజన్మాంతము నేర్వదగినదన్న రహస్యమామెకెరుకయే గావున చెన్నపురమున నివాసమేర్పరచుకొన్నపిదప - త్యాగరాజ శిష్యపరంపరకుచెందిన శ్రీ బూచి అయ్యంగారివద్ద సంగీతకళా రహస్యములను మరికొన్నిటిని వీరు తెలిసికొనిరి.

క్రమముగా వీరితరప్రాంతములలోను కచ్చేరీలు చేయసాగిరి. 1905 నుండియు వీరు ఆదాయపుపన్ను లెఖలకై డైరీవ్రాసిపెట్టుట ప్రారంభమైనది. 1931 వరకు లెఖబెట్టగా - ఈమె ఈ 26 సం॥ లలో సుమారు

146 పట్నములలో కచ్చేరీలు చేసినది; కచ్చేరీల మొత్తము 1235. ఈ కచ్చేరీలు చెన్నరాష్ట్రమునందంతటా జరిగియున్నవి. జాఫ్నాకున్నూ ఒకసారి వెళ్ళివచ్చినారు. కొన్ని ప్రాంతముల పెక్కుసారులు కచ్చేరీలు గావించియున్నారు. పది, పదింటికిపైన, కచ్చేరీలు జరిగిన స్థళములు; వెంకటగిరి, నెల్లూరు, తంజావూరు, తిరుచిరాపల్లి. ఇందు నెల్లూరున 15 కచ్చేరీలు జరిగినవట. ఇక చెన్నపట్నమున చెప్పనక్కరయే లేదు - 849 కచ్చేరీలు 25 సం॥లలో జరిగినవి. పిదప వానిలెక్క తెలియదు. ఈమె ఈ కచ్చేరీలవల్ల నాటికే రు 2,00,000లు ఆర్జించినది.

## దానధర్మములు

మాతృశ్రీ పుట్టలక్ష్మమ్మగారి సంకల్పబలమువల్లను, ఆశీర్వచనమువల్లను శ్రీమతి నాగరత్నముగారికి భాగ్యభోగ్యములపైకన్న విద్యావైరాగ్యములపైననే ఆసక్తిమెండైనది. కాని తప్పనిసరిగా కొంతధనము చేకూరినది. విద్యాధనముముందట లోహధనము లొక్కెనది. వైరాగ్యసంపత్తి త్యాగమార్గమునుచూపినది. సామాన్యముగా నిట్టివారు గర్భవాసమున పుట్టినవారులేరేని ఏ ముక్కుమొగముతిన్నదైన ఆడుపిల్లనో పెంచుకొని-ఆ ఆస్థి ఆ బిడ్డపరమొనర్చుట జరుగుచుండును. కాని ఈమె బుద్ధి మొదట ఆవంకకు కొంతమ్రొగ్గినను భంగపడి పిదప కర్తవ్యతాన్వేషణమునకు గడంగినది. తుదకు సత్పాత్రదానమొనర్పదగునని తలంచి అట్లాచరించినది. ఈమె గావించిన కొన్ని దానధర్మములను ఇందు పేర్కొందును.

చిరకాలము బెంగుళూరునందలి శ్రీరామాలయమున, తన్ను సన్మార్గమునబెట్టి తన బాగోగులకన్నింటికి మూలమైన తల్లిపేరట, బ్రహ్మోత్సవములు జరుపుచుండెడిది. పిదప శ్రీమదాంజనేయస్వామి స్వప్నదర్శనమిచ్చి ఆజ్ఞాపించినమేరకు చెన్నపురి వరదాముత్తియప్పవీధిలో వెంచేసియుండే శ్రీ సీతారామప్రసన్నాంజనేయస్వామివారి దేవాలయమున ఉత్సవములు సల్పుటకు శాశ్వతమగు నేర్పాట్లుగావించినది. మైసూరు సంస్థానమున 'వైరముడి' ఉత్సవము మేలుకోటకు సాగిపోవుమార్గమున నొకమంటపము కట్టించినది. ప్రతి సంవత్సరమామె అక్కడ యొకగొప్పయుత్సవము సాగించుచుండును. తిరువత్తియూరునందొక బజారునుకొని శ్రీ నందికేశ్వరస్వామివారి ఆలయమంతట దీపములుపెట్టుటకై దాని నా స్వామికర్పించినది. గోవిందప్పనాయునివీధియందలి శ్రీ నటరాజస్వామి కైంకర్యములకును, నారాయణవనమందలి 'సారకాయపరదేశి' యను సాధుపుంగవుని ఆశ్రమమునకును భూరివిరాళములొసంగినది. ఎందరికో వివాహాది శుభకార్యములకు ధనసహాయమొనర్చినది. విద్యార్థులకెందరకో స్కూలుజీతములిచ్చినది. అన్నదానమున ఆమె అన్నపూర్ణయే. ఉత్సవదినములలో ఆమెకు నూర్లకొలది బ్రాహ్మణులకు సంతర్పణచేయుట అలవాటు. ప్రతిఅమావాస్యరోజునను వందలకొలది సాధువులకు అన్నదానమొనర్చును. ఇవన్నియు ఆమె గావించిన అసంఖ్యాకధర్మములలో కొన్నియే.

## శ్రీ త్యాగరాజారాధన

వీటన్నింటిలోమిన్న శ్రీ త్యాగరాజారాధన. అందుకే ఆమె తనజీవితము నర్పణముచేసి అందే నివాసమేర్పరచుకొన్నది. ఆమెకు చిన్నతనముననే దైవభక్తి ఎట్లుపొడమినదియు క్రమముగానది, తొత్తుకన్న తదీయము హెచ్చున్నట్లు శ్రీరామచంద్ర భక్తాగ్రేసరుడు, తనగురుపరంపరలో-ఆదిగురువునైన శ్రీ త్యాగరాజస్వామి పరముగా మరలినదియు ఆమెమాటలనే (1946) ఉదహరింతును:

చెన్నపట్టణములో, శ్రీనివాసయ్యారువీధిలో నా స్వగృహములో ప్రవేశించి సుమారు 40 సంవత్సరములాయెను. అప్పటినుండి నా కులదైవమగు శ్రీ వెంకటాచలపతి పూజ యథాశక్తితో జరుపుచుండగ, నా పూర్వపుణ్యవశమున ఒకానొక బ్రాహ్మణోత్తముని ద్వారా శ్రీ కామేశ్వరి దివ్యవిగ్రహము లభించినది,

శ్రీ దేవికి ప్రత్యేకగదిలో బ్రాహ్మణునిద్వారా పూజాదులు జరిపించుచుంటిని. వీలు ననుసరించి నేను శ్రీ దేవి సహస్రనామ పారాయణాదులు చేసికొనుచు ఆనందించుచుంటిని. ఇట్లు నడుచుచుండగ నొకప్పుడు బ్రహ్మశ్రీ-సంగీతవిద్వాన్ ఉమయాల్పురము పంచాపకేశభాగవతులు, శ్రీ త్యాగబ్రహ్మ పట మొకటి ఏడురూపాయలకు నాకొసగి, ఈ స్వాములవారిపటము పూజవలన నీకు చాల మేలు కలుగునని చెప్పిరి. నేను అది లభించిననాటినుంచి అఖండ దీపముంచి, ఒకవిధమైన మూఢభక్తితో పూజా పునస్కారములు జరుపుచుంటిని. ఈమధ్య ఇహలోకసుఖములకు కోరి చేసికొన్న కొన్నిసందర్భములవలన చాలద్రవ్యము వ్యయమై పోయినదిగాని ఇష్టసిద్ధి లేకపోయినది. ఈశ్వరానుగ్రహమున ఏకాకినిగానుండు భాగ్యముకలిగినది. భగవంతుడుతప్ప వేరేగతి లేదనుజ్ఞానమును మహద్విరక్తియు భక్తియు కలిగి, నా జీవితకాలములో ఏదైన తగు ధర్మకైంకర్యము చేయవలెనను చింత సదా కలిగినది. ఈవిధముగ పూజాదులు ప్రారంభించిన పదమూడవదినమున ఒకనాటిరాత్రి త్యాగరాజపటములోనుండు రూపములాగుననే శ్రీసద్గురు త్యాగబ్రహ్మముగారు కూర్చుండునట్లుగానే సమాధినుండి పైకివచ్చి సుందరముఖారవిందముతో దర్శనమీయ నా కత్యాశ్చర్యకరమైన భక్తికలిగి "నరసింహు డుదయించెను" అను సదాశివరాయల కీర్తనపాడుచు కర్పూరము వెలిగించి నమస్కరింపగ, రెండుచేతులు పైకెత్తి ఆశీర్వదించి, అలాగే లోపలి కేగినట్లు స్వప్నమయ్యెను. మేలుకొనగ ఏమి యుతోచలేదు. ఈ స్వప్నమైన మరుదినమే తంజావూరునుండి నా ఆదిగురువులైన బ్రహ్మశ్రీ బిడారం క్రిష్ణప్పగారివద్దనుండి నీవు శ్రీ త్యాగరాజస్వాములవారి సమాధికట్టడ మతిశీఘ్రముగ ప్రారంభించిన చాల బాగుండునని వ్రాసిపంపినజాబు చేరినది. చదివిచూడగ నాస్వప్నమున కిది దృష్టాంతమని భావించితిని. నాటి మధ్యాహ్నమే సంగీతసమాజము సెక్రిటరీ, మునుస్వామినాయుడుగారి ఇంటికిపోయి వారితో స్వప్న సంగతుల చెప్పగ సావకాశముగ ఆలకించిరి. ఆసమయముననే సుప్రసిద్ధులైన హరికథాకాలక్షేపము చేయు బ్రహ్మశ్రీ తంజావూరు నాగరాజభాగవతులు వారిఇంటికి వచ్చియుండిరి. వారున్ను ఈసంగతులువిని చాల ఆశ్చర్యపడి తిరువాలూరులోనుండు అయ్యాగారి సమాధిస్థలమును చూపెదమని చెప్పిరి. ఆనాటిరాత్రే వారిరువురితో తిరువయ్యూరు చేరితిని. వెంటనే అయ్యాగారి వంశీయులైన బ్రహ్మ శ్రీరాముడు భాగవతులను పిలిపించి ఆ సమాధిస్థలమును దాసురాలికి చూపించిరి. దీనికిపూర్వము తిరువయ్యూ రెట్టిదో నేనెరుగను. సమాధిదృశ్యముచుట్టు ముండ్లపొదలు, వెదుళ్లు, క్రూరసర్పముల కాలవాలములైన పుట్టలు మొదలైన వాటిచే ఆవరింపబడి పగటిపూటనే మనుష్యసంచారమునకు దుస్సాధ్యముగ నుండెను. సమాధిదగ్గరయుండు చీలిన విరిగిపడిన ఇతర సమాధులతోను, చూడరాని, చెప్పరాని, ఆభాసములతోను నిండియుండుట కనులార చూడగ నామనస్సు చాల పరితపించినది. ఆనిమిషమే కట్టడములకు కావలసినసామాను తెప్పించి పని ప్రారంభింపచేసి ఇంటికివచ్చితిని.

కట్టడము ప్రారంభించిన తేది 27-10-21. మూడుసంవత్సరములకు సమాధికి గర్భగృహమంటపము తయారైనది. ఇకముందు ఏమిచేయవలెను? లింగస్థాపనమా? లేక శ్రీరామవిగ్రహములా? స్వామివలె విగ్రహస్థాపనచేయుటయా? యని యాలోచించి తిరువయ్యూరులో అనేకబ్రాహ్మణోత్తములు, గొప్పవారు, స్త్రీలు అందరినిచేర్చి వారిముందర గొప్పపూజ సమాధికి జరిపి, చీటి వ్రాసివుంచి, గురుస్వామిని ధ్యానించి "కలలో ఇచ్చినదర్శనము కల్లకాలేదుగదా! నిజముబల్కి రక్షించవలెను. దాసురాలు జీవితురాలైయుండి చూచి ఆనందించవలెను" అని అడుగగ, "తనవలె విగ్రహమును స్థాపించుము" అని ఉత్తరువాయెను. సభలో గూడినవారందరు అలాగే చేయవలయునని జయఘోష యొనరించిరి. ఆవిధముగానే సమాధివద్ద సద్గురు శ్రీ త్యాగరాజస్వాముల విగ్రహమును ద్వారమువద్ద ఇరుప్రక్కల శ్రీ భోగగణపతి, శ్రీ యోగాంజనేయ స్వాములవారి విగ్రహములను 7-1-1925 వ తేది స్థాపించి మహా కుంభాభిషేకము గురుకటాక్ష మహిమచే జరిపించితిని. అప్పటినుండియు నిరంతరపూజ నివేదనాదులు శాశ్వతంబుగ జరుగుటకు తగు

స్థిరాస్తు లేర్పరచి, వారి వంశీకులగు బ్రహ్మశ్రీ రాముడు భాగవతులవారిని నియమించితిని. అప్పటినుండి నేటివరకు వారిచేతనే పూజాదులు జరుపబడుచున్నవి. అన్నియు సద్గురుస్వాములవారి కటాక్షమే.

## ఆరాధనవైభవములు

శ్రీ గురుస్వాములవారి ఆజ్ఞచొప్పున 1907 వత్సరమునుండి వారి ముఖ్యశిష్యులగు నరసింహభాగవతులు, ఉమయాళ్పురం కృష్ణభాగవతులు, సుందరభాగవతులు, ఆకాలమున సుప్రసిద్ధులైన ఇతరవిద్వాంసు లందరుచేరి సంవత్సరమున కొకతూరి ఆరాధనమహోత్సవమును జరుపుతూవచ్చిరి. కొన్ని సంవత్సరములకు వారిలో వారికి భిన్నాభిప్రాయములేర్పడి రెండుకక్షలుగ మారినవి. ముఖ్యమైనవారు నరసింహభాగవతులు పరమపదించిరి. పెద్దకక్షకు ఫిడేలు విద్వాన్ గోవిందస్వామిపిళ్ల, మృదంగ విద్వాన్ అళహానంబిపిళ్ల, నాయకస్థానమును వహించిరి. చిన్నకక్షలో బ్రహ్మశ్రీ, శూలమంగళం - వైద్యనాథభాగవతులు, బ్రహ్మశ్రీ పల్లడం - సంజీవరావుగారు, అరియక్కుడి రామానుజఅయ్యంగారులు యాజమాన్యము వహించిరి. చిన్న కక్షవారు నాలుగురోజులు ముందుగ ప్రారంభించి పంచమితో ముగింపు; పెద్దకక్షవారు పంచమినుండి ఉత్సవము ప్రారంభించి ఐదవరోజున ముగింపు చేయించుచువచ్చిరి. చిన్నకక్షవారు తిరువయ్యారు హైస్కూలులోను, పెద్దకక్షవారు కళ్యాణమహాలులోను మహావైభవముగ జరుపుతూవచ్చిరి. ఆరాధనపు దినము దాసురాలిపూజ జరిగినపిమ్మట పెద్దకక్షవారి పూజ భజన తరువాత చిన్నకక్షవారి సమాధిపూజ జరుపుచుండిరి.

ఇట్లుండ గురుస్వాములవారి కరుణవలన సమాధిస్థలముననే ఉత్సవము చేయవలయునని మనస్సులో తలంపుకలిగినది. కారణమేమన—ఈ రెండుకక్షలు ఉత్సవములు చేయుస్థలములకు స్త్రీలు రాకూడదు అను కట్టుబాటు. ఇక భక్తురాండ్రగు విదుషీమణులు ఎట్లు కడతేరుదురు? గురుస్వాము లీ దాసురాలికి పూర్ణానుగ్రహము చేసియుండ కొదవేమియుండునని తలచి సద్గురుస్వాములవారి యాజ్ఞతో 1927 వత్సరమున ఉత్సవము పంచమినుండి సమాధివెనుకభాగమున ప్రారంభించితిని. "అల్పారంభః క్షేమకరః" అన్నట్లుగ శుక్లపక్ష చంద్రునివలె అభివృద్ధియై మద్రాసులో ప్రసిద్ధిచెందిన, దేవదాసీమణుల పాటలు, కాలక్షేపములు, సుప్రసిద్ధవిద్వాంసుల కచ్చేరి, కాలక్షేపములు జరుపుతూ తంజావూరి విద్వాంసులు, స్త్రీలు, అందరు సమాధివెనుకభాగములో వసతిలేనిస్థలములో భక్తితో నాకు తోడునీడగ సహాయమొనరించుచుండ, శ్రీ గురుస్వాముల యపారకరుణవలన సమాధికి ఎదురుగనుండుతోట, భూములు, శ్రీ తంజావూరు రాజబంధువులైన శ్రీ రాజారాం సాహేబుగారివలన లభించినవి. వెంటనే గొప్పప్రాకారము, నాలుగు గదులు మొదలైనవి దాసురాలి స్వార్జితపైకముతో కట్టబడి పూర్తియై ఆ విశాలస్థలములోనే ఆరాధనోత్సవములు మహావైభవముగ జరుగుతూవచ్చినవి.

అంత పండ్రెండువత్సరములు జరిగి, పదమూడవవత్సర ప్రారంభములో గురుస్వాముల ప్రభావమువలన రెండుకక్షల విద్వాంసులకు జ్ఞానోదయమై అందరు ఒకటిగజేరి దాసురాలితో ఏకీభవించి 1940 సంవత్సరమునుండి సమాధికట్టడమునం దుత్సవము ప్రారంభించిరి. శ్రీ తిరువయ్యారు త్యాగబ్రహ్మ ఆరాధనోత్సవమని సభ ఏర్పరచుకొనిరి. అది మొదలుగ రేడియో ఫిట్టింగులతో అతివైభవముగ లెక్కలేని పాటలు, హరికథలు, గొప్ప అన్నదానములతో జరుపుతున్నారు. ఐదుదినము లుత్సవవైభవములు, ఆరవ దినము "వడాయితి"—అనగ వడలు మాలవేసి శ్రీమదాంజనేయస్వామివారిని పూజించి వెళ్లేవారు. ఇతర ఏవిధమైన స్వాతంత్ర్యము వారలకు లేదు.

ముఖ్యముగ సమాధిస్థలమున శ్రమయనుకోక రాత్రింబవళ్లు చాల శ్రమపడి దేవలోకమువలె కట్టడము

తయారుచేసిన శ్రీ తిరువయ్యారు C. V. రాజగోపాలాచార్యులు అందరిచే స్తోత్రార్హులై శ్రీ త్యాగరాజ నిజభక్తులని పేరుపొంది ఇప్పటికిన్నీ శ్రీ త్యాగరాజస్వాముల కైంకర్యములో మునిగి సమస్తకార్యములను నడుపుచున్నారు. వారు దానురాలికి రెండవగురుదైవ మనిన యతిశయోక్తిగాదు."

## ఈమె ప్రశంసలు

ఈమె కచ్చేరిలొనర్చినప్పుడు ప్రశంసింపనివారరుదు. ఈమెకు ఉపాసనాబలిమిచే దైవీసంపత్తిగలదని పైవివరములవల్ల సుగ్రాహ్యముకాగలదు. ఈమె పాడునప్పుడు - భక్తిపారవశ్యమున నాదబ్రహ్మముతో తాదాత్మ్యముపొందునని యందురు. అందుచే నీమెగానము మనోహరమైయుండును.

ఈమెకు మైసూరు, బొబ్బిలి, వెంకటగిరి ఆస్థానములలో గౌరవస్థానముకలదు. ఉత్సవసమయులందు దర్బారులలో మంత్రులు, పండితులు, రాజబంధువులు మున్నగువారలతో సమానమగుస్థానమున నీమెకు ఉచితాసనమిత్తురు.

శ్రీ కవిరాజ కవిసార్వభౌమ శ్రీపాదకృష్ణమూర్తిశాస్త్రిగారు తమకావ్యములందు ప్రశంసించి యున్నారు. శ్రీ శతావధాని చెళ్లపిళ్ల వెంకటేశ్వర కవిగారు 'గీరతము'ను తమ కావ్యమునందును, బొబ్బిలిరాజావారి పట్టాభిషేకోత్సవ ప్రశంసా కావ్యమునందును ఈమెను పొగడియున్నారు. ఇంక మహామహోపాధ్యాయ శివశంకరశాస్త్రి (బెంగుళూరు) యస్. గంగాపట్నం సుబ్రహ్మణ్యకవి, పురాణం సూర్యనారాయణతీర్థులు, విద్వాన్ దోమా వెంకటస్వామిగుప్త, విద్వాన్ చంద్రశేఖరశర్మ, విద్వాన్ పోకల శేషాచలంనాయుడు, విద్వాన్ కాశీప్రసాదరావు, యస్. త్యాగరాజ శివయోగి, ఆదిభట్టనారాయణదాసు వేదాల్ల సూర్యనారాయణశాస్త్రి(కాశీ), రామలింగస్వామికవి, పాలంకి గంగాధరశాస్త్రికవి ఇత్యాదులెందరో తమతమ కావ్యములలో వీరి గానకళావిశారదత్వమును ప్రశంసించిరి. 1929 సం॥న చెన్నపురిలో జరిగిన అఖిలభారత సనాతన హిందూధర్మ మహాసభలో ప్రార్థనలసలుపగా ఈమె సంస్కృతజ్ఞానమునకు, ఉచ్చారణనిర్దుష్టతకు గానకళావిశేషమునకు శ్రీ బాబూ నరేంద్రనాద్ సేన్, ప్రభృతులందరు మిక్కిలిగా మెచ్చుకొని సభలో ఉచితమగు ఉన్నతస్థానమిచ్చి గౌరవించిరి. అశ్లేకవిసార్వభౌమ శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారికి కవిగండ పెండేర మిచ్చుతరి - ఈమెనాహ్వానించిరి. మహారాజాధిరాజులనైన ఈసడించు నతిశయులు శ్రీ శతావధాని చెళ్లపిళ్ల వేంకటశాస్త్రిగారు. అట్టివారే ఈమెకెదురేగి ఆహ్వానించి బసజేర్చిరనగా, అట్టిమహనీయులతోగూడిన విద్వత్సభయు వీరి ఉపన్యాసామృతమును గ్రోలెననగా, వీరిఘనతను వేరుగ వివరింపవలెనా?

శ్రీ త్యాగరాజస్వామివారి ఆలయనిర్మాణ, ఆరాధనాది కైంకర్యములకై వీరుగావించిన గావించుచున్న కృషి బహుప్రశంసాపాత్రమైనది. శ్రీ వాగ్గేయకారరత్న హరినాగభూషణం, గాయక సార్వభౌమ పారుపల్లి రామకృష్ణయ్య, సాహిత్యవిశారద విమర్శకశిరోమణి కోన వెంకట్రాయశర్మప్రభృతులు - గొప్పగా పొగడి ఆంధ్రపత్రికల వ్రాసియున్నారు. సుప్రసిద్ధ గానకళాధ్యాపకులైన శ్రీ సి. ఆర్. శ్రీనివాసయ్యంగారు ఆమెనీకార్యమునకై ఇట్లుప్రశంసించిరి:

"దక్షిణదేశమున సంగీతకళతో సంబంధముగలలక్షలాదిజనములో శ్రీ త్యాగరాజస్వామిభక్తురాలైన తాము, తామే, చెప్పుకోతగినట్లుగా వారిజ్ఞాపకార్థమై స్మారకచిహ్నమునేర్పరచి, గర్వింపదగిన అవకాశమును సద్వినియోగ మొనర్చియున్నారు. ఏరాజును, ఏమహారాజును, ఏజమీందారుడును, ఏపాటకుడును, ఆ కీర్తిని గాంచలేదు. మేమందరమును మిమ్ములనిందులకభినందించుచున్నాము."

## గ్రంథరచన

ఈమె కొన్ని గ్రంథములను రచించియున్నది. అందు ముఖ్యమైనవి: శ్రీ త్యాగరాజ అష్టోత్తర శతనామావళి, (సంస్కృతం) మద్యపానం (తెలుగు సంభాషణం) దేవదాసీ ప్రబోధచంద్రోదయం (తెలుగు కరపత్రములు) పంచీకరణ భౌతిక వివేక విలక్కం (తమిళం.)

## వీరేశలింగంగారితో వివాదము.

ఆ రోజులలో శ్రీ కందుకూరి వీరేశలింగంపంతులుగారికి ఎదురాడు వారులేరు. వారి సంఘ సంస్కరణ కార్యక్రమమున భోగము మేళముల నిషేధము ముఖ్యాంశము. ఆనాటి యువకుల తలల కా వెర్రి బాగుగా నెక్కియుండెను.

శ్రీ పంతులుగారు కవులచరిత్ర వ్రాయుచు నందు-మహారాష్ట్రపాలకుడగు తంజావూరి ప్రతాపసింహుని ఆస్థానకవయిత్రి శ్రీమతి ముద్దుపళనివిరచిత రాధికాసాంత్వనమును, ఆమె జీవితమును రచించుపట్ల ప్రస్తావించి వేశ్యగదాయని పంతులువారు 'ఇసి' యని పల్కరించుచు, ఆమెగావించిన శృంగారవర్ణనమును నిరసించిరి. ఆ సందర్భమున ఆమెను కొంత తూలబల్కిరికూడ. అందుకీమె సహింపజాలదాయెను. ఆ గ్రంథమునకు పూర్ణమైన వ్రాతపతినొకటి సంపాదించి అందున్న తప్పుల సవరించి శుద్ధప్రతినొక్కటి తయారుగావించి, శ్రీ వావిళ్లవారికి ప్రచురణార్థమై అప్పగించుచు దానికొక ప్రస్తావనను వీరువ్రాసిరి. అందు శ్రీ పంతులవారు ముద్దుపళనిని గూర్చివ్రాసిన వాక్యముల ఖండించిరి. వా రాక్షేపించిన శృంగార వర్ణనాదికములు, వారే పరిష్కరించి అచ్చొత్తింపించిన వైజయన్తీ విలాసమున నెత్తిచూపిరి. రాధికా సాంత్వనమునందలి పీఠికను సరిగా చూడక ముద్దుపళని తండ్రిని 'తల్లి' యనివ్రాసిన పొరబాటును బయల్పరచిరి. ఆవివాదమునందలి పూర్వపక్ష సిద్ధాంతములు మనకిక్కడ ప్రస్తావనీయములుగావు. తమకులమును దూలనాడినవారు సర్వజనమాన్యులైనను సరసముగా ఉదాత్తముగ వారి వ్రాతలుఖండించిన వీరి నేర్పును, ఆత్మగౌరవాభిమానములునే ఇక్కడ ప్రశంసనీయములు.

## బిరుదములు సన్మానములు.

శ్రీ నాగరత్నముగారికి శ్రీ శ్రీ శ్రీ చామరాజేంద్రులవారు మొదలుగా అనేకులు పెద్దలు, ధనికులు పండితులు, ధనపుసంచులతోను, కనకకింకిణీకంకణములతోను, బంగరుపతకములతోను (భారత గాయక శిఖామణియగు శ్రీ విష్ణుదిగంబర్ గారి అధ్యక్షతక్రింద మద్రాసున గూడి అఖిలభారత సంగీత మహాసభవారు సంగీతకళయందు నేర్పరియని ఈమె కొక్కరికే పతకమిచ్చిరి.) సన్మానము లొనర్చిరి; బిరుదము లొసంగిరి. వానిలో ముఖ్యములు: చిరకాలముననే వారి విద్యావైదుష్యములను గాంచి శ్రీ పురాణం సూర్యనారాయణ తీర్థులవారు "విద్యాసుందరి" అన్న బిరుద మొసంగిరి. 1932లో చెన్నపురిలో శ్రీ కన్యకాపరమేశ్వరీ ధర్మసంస్థయందు, కచ్చేరి జరుగగా సభాసదుల కోరికపై శ్రీ కవిసార్వభౌమ శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి గారు "గానకళావిశారద" అన్న బిరుదము నొసంగిరి. నేడు (6-3-49) శ్రీ కేసరిగారు "గృహలక్ష్మి స్వర్ణకంకణ" మొసంగినారు. చెన్నపురి మహిళామణులు ఈనాడే "త్యాగసేవాసక్త" అన్న బిరుద మొసంగి గౌరవించుచున్నారు.

## ఆమె దైవీసంపత్తి

అంతేగాక ఈమెకు దైవసాక్షాత్కారము కలదనుటకు త్యాగరాజస్వామి ఈమె స్వప్నముల తోడ తనయభీష్టముల వెలిబుచ్చుటయే తార్కాణము.




శ్రీ నాగరత్నంగారు తమ పెంపుడుకుక్కతో :
ఇది సంగీతమభ్యసించిన కుక్క. యజమానిరాలితో చేరి 'సాపాసా'లు
శాస్త్రీయముగ మెఁరుగనేర్చినకుక్క ; అపశృతి విన సహింపక
మొరవనేర్చిన కుక్క.



బెంగుళూరున వైష్ణవమిత్రుల ప్రోత్సాహమున
శ్రీ నాగరత్నంగారు ధరించిన వైష్ణవివేషము.



మైసూరు సంస్థానమున దర్బారుమన్నన లందు కాలమున
రాజలాంఛనములతో నున్న వైభవము.



శ్రీ నాగరత్నంగారి పూనికచే ప్రతిష్ఠింపబడిన
శ్రీ త్యాగరాజస్వామివారి విగ్రహము. నిత్యనైవేద్య
దీపారాధనల నారాధింప బడుచున్నది.

మరియు నొకటిరెండు జీవిత విశేషములవలన — ఈమెకు భగవల్లీల ఆవేశించుచుండునని తలంచుట కవకాశమిచ్చుచున్నది. శ్రీ త్యాగరాజస్వామి ఆలయనిర్మాణము జరిగినచోటు కంటకావృతమును, విష జంతునివాసమునైయుండెను. కాని ఆలయనిర్మాణప్రారంభ ప్రభృతి వేలకొలది ప్రజలందుమూగి రోజుల కొలదిగడుపుచున్నారు. ఆమె పవిత్రతవల్లనే ఎవ్వరికిని చీమయైన కుట్టుటలేదని నమ్ముదురు.

ఒకసారి ఆమె మద్రాసునుండి తిరువాయూరు ప్రయాణముపెట్టుకొనియుండెను. ఎంతసేపటికిన్నీ దాసి మేడమీదికిరాలేదు. దాసిదానిని బిగ్గరగా పిలిచినది. కాని దాసిదానికి మెడచుట్టు పాముచుట్టుకొని యుండెను; ఆమె గొంతెత్తుటకు వీలులేకుండెను. తుదకెట్లో సవరించుకుని ఆదాసి ఆర్తనాదమొనర్చినది. ఏమిమూడినదో యన్న ఆత్రమున ఆమె మేడదిగి వచ్చుచు సంస్కృతమున దైవస్తోత్రమొనర్చి - "చుష్టస్తం భన"అని కేకవైచినదట. తీరా క్రిందికివచ్చిచూచునప్పటికి ఆపాము నాదాసి ఎట్లో చేతపెరికి క్రిందవైచినది. ఆపాముసు మంత్రరుద్ధమైనట్లు కదలక మెదలక నిల్చిపోయినది. ఇట్టివెన్నియో అద్భుతములు ఆమెజీవితమున అనుభవములోనికి వచ్చియున్నవి.

ఆమె నేడు 70 వ పరవడిలోనున్నది. శరీరపాటవము కొంత తప్పియున్నను శారీరమేమాత్రము జంకి లేదు. కొంతకాలముక్రిందట ఆమె సంగీతకవిద్యాలయమొకటి నెలకొల్పవలయునని తలంచినట్లున్నది; నేడు ప్రభుత్వమే ఆపనికి పూనుకొన్నదిగాన ఆమెనాకోరిక నేడువిడిచినదేమో? ఆమె ఇకగలజీవితమున–శ్రీత్యాగ రాజస్వామివారిని, వారి ఉపాస్యదైవమగు శ్రీరామచంద్రప్రభుని ఏకాంతభక్తితో సేవించుచు, తనకుగల సర్వస్వము వారి సేవాకైంకర్యములకే త్యాగమొనర్చి మోక్షసామ్రాజ్యము చూరగొందామన్న ఏకైక వాంఛాయత్తచిత్తయై కాలముగడుపుచున్నది.

ఆ సేవాకైంకర్యములేపాటివో వారి మాటలలో నేగలదు:

"ఇంకను సమాధిస్థలములో కొంత బందోబస్తు, నిత్యము మతభేదములేక శక్త్యానుసారము అన్నదానము, జరుగవలెనని ఆశకలదు. ఏ మహానుభావుల కీ పుణ్యమబ్బునో వారే ధన్యులు! వారే మాన్యులు!! ప్రాప్త ముండిన వదలదు. అన్నియు శ్రీ త్యాగబ్రహ్మస్వాములవారి అనుగ్రహము."

జన్మతః కన్నడము మాతృభాషయైనను - సంగీతకవిద్యాభ్యాసవశమున సంస్కారముచే తెలుగుతల్లికి దత్తమైన ఈధన్యజీవి - తెలుగుజాతిని పునీతమొనర్చినది. ఇట్టి విదుషీమణికి శ్రీ కేసరిగారీసారి "గృహలక్ష్మి స్వర్ణకంకణ" మిచ్చుట మిక్కిలి సమంజసము.

6-3-1949 న శ్రీ కేసరిగారొనర్చుచున్న

# గృహలక్ష్మి స్వర్ణకంకణ ప్రదానోత్సవ శుభసమయమున

విద్యాసుందరి, గానకళావిశారద

## శ్రీమతి బెంగుళూరి నాగరత్నంగారికి

చెన్నపురి మహిళామణులమైన మేము

# "త్యాగసేవాసక్త"

అను బిరుదము నిచ్చుటకు ఆనందించుచున్నాము.



ఆజన్మాంతః సంగీతకళాభ్యాసమొనర్చి, శ్రీ త్యాగబ్రహ్మ శిష్యపరంపరం జేరి, సంగీతకళారాధనమొనర్చియు, అనేక దానధర్మములొనర్చి నిజసంపాదిత ధనత్యాగమొనర్చియు శ్రీ రామభక్తాగ్రేసరులు, సంగీతకళానిధులునైన శ్రీ త్యాగరాజస్వామివారియందు భక్తి పారవశ్యమున వారియారాధన ఆలయనిర్మాణాది పుణ్యకార్య పరంపరయందు నిరంతరాసక్తి భక్తియుక్తులై త్యాగమయ జీవితమునడుపుచున్న తమ అతిశయమున కిదిలవలేశముగా స్వీకరింతురుగాక.

శ్రీ విద్యావతీదేవి - విజయనగరం

కస్తూరి రుక్మిణి
కా. రామాయమ్మ
క. శారదాదేవి
శి. కామాక్షమ్మ
మ. సూర్యకుమారి
ఈ. సరస్వతమ్మ
మ. రుక్మిణమ్మ
శ్రీ. బి. కనకరాజేశ్వరమ్మ

చిం. సీతమ్మ
గిడుగు లక్ష్మీకాంతమ్మ
పాలూరి సీతామహాలక్ష్మమ్మ
ఆలమూరి రాజేశ్వరమ్మ
మైదవోలు పద్మావతి
క. మంగళాంబ
డి. వీరలక్ష్మి
కా. వరలక్ష్మి

అ. చన్నఘంటమ్మ
జ. జమునాబాయి
గజ్జల లీల
టి. వి. మంజుల
యం. సుశీల
రా. శేషలీలావతి
న్యాయపతి కామేశ్వరి
కోట సీతారామమ్మ

# గృహలక్ష్మీ స్వర్ణకంకణ ప్రదానోత్సవ వృత్తాంతం

కంకణగృహీత శ్రీమతి నాగరత్నమ్మగారు రు 2000 లను శ్రీ కేసరీకన్యా విద్యాలయమునకు ఈ ఉత్సవ జ్ఞాపకార్థముగా విరాళమిచ్చిరి. దాని వడ్డీలోనుండి రు 50/- లకు ప్రతి సంవత్సరమున్నూ బాగుగా సంగీతము పాడనేర్చిన విద్యార్థినికి బంగారుపతక మివ్వవలయునని నిర్ణయించిరి. మరియు తమ కివ్వబడిన స్వర్ణకంకణమును - ఈ కన్యావిద్యాలయమందే నిక్షేపించుటకు నిర్ణయించుకొన్నారు. ప్రతి సంవత్సరమున్నూ బంగారు పతకమిచ్చుసమయమున సభవారి కది ప్రదర్శింపవలయుననియు ఆమె కోరినది.

6-3-49 న చెన్నపురి రాయపేటలోనుండు కేసరీకుటీరము భవనమునందు - గృహలక్ష్మీ స్వర్ణకంకణ ప్రదానోత్సవం అతివైభవంగా జరిగినది. చక్కగా నలంకరింపబడిన భవనమునందు ప్రొఫెసర్ సాంబమూర్తి, చావలి హనుమంతరావు, కవికొండల బ్రహ్మయ్యపంతులు, మైదవోలు శేషాచలపతి, న్యాయపతి కామేశ్వరి, యామినీ పూర్ణతిలక, శ్రీపాద గోపాలకృష్ణమూర్తి, శ్రీ శ్రీ శ్రీ విజయనగరం మహారాణీ సాహెబా విద్యావతీదేవిగారు, భాగవతురాలు బన్నీబాయి, 'జగన్మోహిని' యను తమిళపత్రిక సంపాదకురాలు, నవలారాణి, శ్రీమతి వి యం. కోదైనాయకమ్మాళ్, గుహప్రియఅమ్మ, శ్రీ పెదపవనిరాణీగారు, కాంతీపురం పాపాతిఅమ్మ, వట్టం శేషయ్యశెట్టి, కేసరీహైస్కూలు ప్రధానోపాధ్యాయులు కనుపర్తి సుబ్రహ్మణ్యం, విస్సా రాజగోపాలరావు, రామచంద్ర అగస్త్య మున్నగువారు సభనలంకరించిరి. గృహీత విద్యాసుందరి గానకళావిశారద శ్రీమతి బెంగుళూరు నాగరత్నంగారితోకూడా సభాసదులు కొందరు చేరగా ఛాయాపటము తీయించబడిన పిమ్మట సభాప్రారంభమాయెను.

ఎత్తుగా సుఖాసనము లమర్పబడిన వేదికపై తొలుతగా చిరంజీవి వసంతకుమారి కోకిలస్వరమున మృదుమధురముగ రాగాలాపన మొనర్చి, ఈ క్రింది పద్యముతో ప్రార్థన గావించి సభాసదుల నాహ్లాదపరచెను.

ఒకవంక వాణి వేరొకవంక హరిరాణి వింజామరల్ పూని వీచుచుండ,
ఆదికవీశ్వరుండగు బ్రహ్మదేవుఁడు జయబిరుదావళుల్ చదువుచుండ,

పలు వేసములసామి పడతివేసమునాటి వింతలు చూపి నవ్వించుచుండ,
జయ్ జయ్ హసాదంచు చేతులుజోడించి శివుడాజ్ఞకై ప్రతీక్షించుచుండ,

నిండుకొలువుండి ఎల్లబ్రహ్మాండములను చతురమైనకటాక్ష ప్రసారమాత్ర
మేలుచుండెడి దేవి కామేశ్వరమ్మ ప్రీతి మాకృతు లంగీకరింపుమమ్మ.

అంత "బాల" పత్రిక సహాయసంపాదకురాలు, మానేజరు శ్రీమతి న్యాయపతి కామేశ్వరి బి. ఏ.

ఎల్. టి గారు అధ్యక్షురాలగు గిడుగు లక్ష్మీకాంతమ్మగారిని అధ్యక్షతవహింపుడని కోరుచు నిట్లు ఉపన్యసించిరి.

శ్రీ కేసరిగారి పిలుపును ఆదరించి వచ్చినవారికి సుస్వాగతం.

శ్రీ కేసరిగారు తాముస్థాపించిన గృహలక్ష్మిపత్రికమూలంగాను, యీ స్వర్ణకంకణ ప్రదానమువలనను వారు నారీలోకమునెడల తమకు గల గౌరవము తెలియపరచుచున్నందులకు మనం గర్వించాలి.

ఈఉత్సవానికి శ్రీ గిడుగు లక్ష్మీకాంతమ్మగారిని అధ్యక్షురాలినిగా ఎన్నుకోవడంకూడా సమంజసమే.

శ్రీ లక్ష్మీకాంతమ్మగారినిగురించి మీలో చాలామందికి తెలియకపోవచ్చును. ఆమె చక్కని కవయిత్రి. పండితవంశమైన గిడుగువారికోడలు ఈమె. ఆమె, ఆమెమరదలు శ్రీ॥ కీ॥ శే॥ జొన్నలగడ్డ శారదాంబగారూ కలిసి తెలుగుభాషాసేవ ఎంతో చేశారు.

శ్రీ లక్ష్మీశారదా గ్రంథమాలను స్థాపించి చక్కని పద్యకావ్యములూ, పాటలపుస్తకాలూ ప్రచురించారు. అట్టివారిని ఈసభకు అధ్యక్షతవహింపుడని శ్రీ కేసరిగారితరపున నేను కోరుచున్నాను.

అంత శ్రీమతి గిడుగు లక్ష్మీకాంతమ్మగారు సభాసదుల కరతాళధ్వనులమధ్య వేదికపైకివచ్చి సభాధ్యక్షతవహించిరి. వారికిర్వంకల కంకణప్రదాత శ్రీ కేసరిగారును, గృహీత శ్రీమతి నాగరత్నంగారును, బిరుదుప్రదాతలు శ్రీశ్రీశ్రీ విజయనగరం మహారాణీసాహెబా విద్యావతీదేవిగారును సుఖాసీనులైరి. అంత అధ్యక్షురాలు లేచి తొలుతగా, కీ॥ శే॥ సరోజినీనాయుడుగారి జ్ఞాపకార్థం వారి ఆత్మకు శాంతిగా - అందరు లేచినిల్చి రెండునిమిషములు శాంతముగా ప్రార్థనసలుపుడని సభాసదులనుకోరగా అట్లుజరిగెను.

ఆతరువాత శ్రీ రామచంద్రుని వెంకటప్పగారు కంకణగృహీత శ్రీమతి బెంగుళూరు నాగరత్నంగారి జీవితచారిత్రమందలి ముఖ్యఘట్టములను కొన్నివివరించి, ఎల్లరు స్త్రీలే ఇచ్చటసమావేశమై, స్త్రీలయుత్సవమైన దీనిని నిర్వహింప సంసిద్ధమైయుండగా తాము పోతుపేరంటాలువలె వారిమధ్యనిలిచి కాలహరణమొనర్చుట న్యాయముకాదనియు శ్రీ నాగరత్నముగారిజీవితము ఈ గృహలక్ష్మిసంచికలో పూర్తిగావచ్చుననియు తెల్పి వేదిక దిగిరి.

ఆ పిదప శ్రీ గిడుగు శ్రీనివాసరావుపంతులు బి. యస్. సి గారు-ఉత్సవవిజయము నాశించుచు పంపబడిన సందేశములను చదివిరి. వానిని వేరుగానిచ్చియున్నాము. ముఖ్యముగా - శ్రీ శ్రీ రమణమహర్షుల వారి ఆశీర్వచనము - సర్వజనానందకరమాయెను.

తర్వాత కంకణప్రదాతలు శ్రీ కేసరిగారు - కంకణప్రదానమొనర్చుచు, తమఆహ్వానమును మన్నించి దయతో నీయుత్సవమునకు విచ్చేసినవారందరికి వందనములర్పించి ఇట్లుపన్యసించిరి:

## శ్రీ కేసరిగారి ఉపన్యాసము

నేనిదివరలో గృహలక్ష్మి స్వర్ణకంకణమును పెద్దముత్తైదువులకు కొందరికిచ్చితిని; ముందుముత్తైదువులకు కూడా కొందరికిచ్చితిని. కాని నేడు నిత్యముత్తైదువ యైన శ్రీ నాగరత్నముగార్కిచ్చుచున్నాను. ఏలననగా ఆమె విద్యాసుందరి; గానకళావిశారద; కవయిత్రి: త్యాగి; భక్తురాలు.

ఇంతకుముందు వెంకటప్పగారు చెప్పిన ఆమెజీవితవిశేషములుగాక మరికొన్ని నాకుతెలిసినవి ఇచ్చట చెప్పదలంచినాను.

(తరువాత 171 చూడుడు)

# నా చిన్ననాటి ముచ్చట్లు

డా॥ కే. ఎన్. కేసరి

## మద్రాసులో అగ్రహారములు—ధర్మసంస్థలు

చెన్నపట్టణము అన్నిజాతులకుకూడలి స్థలమైనను బ్రాహ్మణులకు ప్రత్యేకముగ అగ్రహారములున్నవి. కొల్లావారి అగ్రహారం, క్రిష్ణప్పనాయుని అగ్రహారం, ఏకామ్రేశ్వర అగ్రహారం, రావిచెట్టు అగ్రహారం మొదలగునవి మరికొన్నియును గలవు. ఇప్పుడా అగ్రహారములలో బ్రాహ్మణులు తక్కువ; బ్రాహ్మణేతరులు అధికముగ నివసించుచున్నారు.

### ధర్మసంస్థలు

ముందుకాలమున మద్రాసులోయుండు వైశ్యులు నాయుళ్లు మొదలియార్లు బ్రాహ్మణభక్తిని కలిగియుండిరి. వీరియింఢ్లలో జరుగు వివాహాది శుభకార్యములకు అశుభకార్యములకు బ్రాహ్మణులకు లడ్డు పేణీలతోకూడ భోజనమునుపెట్టుచు భూరి సంభావనలను యిచ్చుచుండిరి. ఆకాలమున అనేక అన్నసత్రములలో బ్రాహ్మణులకు అన్నమును పెట్టుచుండిరి. దినమునకు సుమారు వెయ్యిమంది బ్రాహ్మణులు భుజించుటకు తగిన వసతిగల ధర్మసత్రములుండెను. మొదట నేను ఈవూరికి వచ్చినప్పుడు ఈసత్రముల లోనే భుజించుచుంటిని.

### తంజావూరు రామానాయుని ధర్మసత్రము—అగ్రహారము

తిరువత్తియూరు హైరోడ్డులో తంజావూరు రామానాయుని సత్రమును, దాని నంటి అగ్రహారమున్నూ గలవు. ఈ రామానాయుడు చాల బ్రాహ్మణభక్తిపరుడు౹ దైవభీతి కలవాడు. ఇచ్చట తండియార్పేటలోనే గాక తిరువళ్లూరు, కాంచీనగరము లందును ధర్మసత్రములను వేసియున్నాడు.

రామానాయుని కుమారుడు రంగయ్యనాయుడుగారు 1822 సం॥ డిశెంబరు 7-వ తేదికిసరియైన చిత్రభాను సం॥రము కార్తీక బ॥లు నాడు తెలుగులో వ్రాసియుంచిన

వీలునామా చూడగా వారిదానధర్మములును, రంగయ్యనాయుడుగారి బ్రాహ్మణభక్తి, దైవభీతి, శీలసంపత్తి మున్నగునవియున్నూ స్పష్టమగుచున్నవి. తండియార్పేటలోని సత్రమున ఆ రోజులలో - 160 మంది పరదేశీలకు, విద్యార్థులకు, 60 మంది నౌకర్లకు మూడుపూటల ఇష్టమృష్టాన్న భోజనమున తృప్తుల గావించుట కేర్పాటు చేయబడియుండెను. ఇచ్చట విద్యార్థులకు భోజనముపెట్టి, పండితులచే వేదశాస్త్రములను చెప్పించేవారు. తిరువళ్లూరు, కాంచీనగరములందలి ధర్మసత్రములందు 12 సి మంది బ్రాహ్మణబాలురు భోజనవసతిగల్గి - వేదాధ్యయన మొనర్చుచు, ధర్మశాస్త్రములను పఠించుచుండిరి. ఆ వీలునామాయందంతటను శ్రీరామనామస్మరణ విరివిగా చేయబడినది. "పవిత్రమైన శ్రీరామనామ మాహాత్మ్యమువల్లనే మన వంశాభివృద్ధి, మన పూర్వులచే స్థాపింపబడిన ధర్మాభివృద్ధి, సాగుచున్నవి. ఆ రాముడే మీకు భవిష్యత్తునందు సంరక్షకుడు. నిరంతరము రామనామము జపమొనర్చుటకై ఇద్దరుబ్రాహ్మణులను మనయింట ఏర్పాటు చేసియున్న సంగతి మీకు తెలియును. మీరును అట్లే నిరంతరము శ్రీరామనామజపము గావించు బ్రాహ్మణులను ఏర్పాటు చేయవలసినది"-అని ఆవీలునందు వ్రాసియున్నారు. ఈసత్రము పరిపాలనవిషయమై కోర్టువారును ఒకటి రెండుసార్లు జోక్యము కల్పించుకొని స్కీములు నిర్మించియున్నారు.

ఇట్టివే, అన్నసత్రములు మరికొన్ని మద్రాసు చుట్టుప్రక్కలనున్నవి. తిరువత్తియూరునందు, తిరువళ్లూరునందు యాత్రికుల వసతికొరకు ఎన్నైనా సత్రములున్నవి.

పూర్వము చెన్నపట్నం సమీపమున కొండూరు అని ఒకచిన్న స్టేషన్ ఉండెడిది. ఆ ఊరినే ఇప్పుడు విల్లివాకము స్టేషనుగ మార్చినారు. ఈ కొండూరునందు విశాలమైన ధర్మసత్రములున్నవి. ఇక్కడొక బావినీరు చాలప్రశస్తమైనదని ప్రతీతి. అందుచే మద్రాసునుండి అనేకులు అచ్చటికిపోయి వివాహాది శుభకార్యములు చేసుకొనుచుండిరి. ఇప్పుడు మద్రాసులో పనులుగలవారు ఇండ్లనునిర్మించుకొని ఆరోగ్యమునకై అక్కడ నివసించుచున్నారు. ఇటీవల దీనినికూడ ప్రధానమగు చెన్నపట్నమున కలిపివేయవలెననే సూచన ఆలోచనలోనున్నది. అప్పుడప్పుడు మద్రాసునుండి కొందరు అక్కడికిపోయి ఆ విశాలమైన సత్రములలో ప్రతి ఆదివారమున్నూ వనభోజనములను (Picnic Parties) చేసి వచ్చుచుండిరి.

### దుడ్డువారిగుంట—బ్రహ్మతీర్థరి

మద్రాసులోయుండు జనులు చాలవరకు బాడుగయిండ్లలలోనే నివసించువారగుటవలన, యెవరైనను ఆయింటిలో చనిపోయిన కర్మాంతరములను జరిపించుటకు యితర

కాపురస్థులు ఒప్పుకొనేవారుకారు. ఈకారణమువలన మద్రాసులోనివారు చాల యిబ్బంది పడుచుండిరి. ఈ కార్యములను చేయుటకు ధర్మసత్రములను యిచ్చెడివారు కారు. ఇట్టి కష్టములను ముఖ్యముగ బ్రాహ్మణులే అనుభవించుచుండిరి.

ఈకష్టములనుచూచి యొక బ్రాహ్మణోత్తముడు రాయపురములో ఒక చిన్న తోటను అందు ఒకయిల్లునుఇచ్చి ఈకార్యములను అక్కడచేయుటకు తగుయేర్పాటులను చేసి పుణ్యమును కట్టుకొనెను. ఈ బ్రహ్మతీర్థమునందు బ్రాహ్మణులు మాత్రమే అపర క్రియలను జరుపుకొనవచ్చును. ఈచిన్నప్రదేశము ఇప్పుడు బ్రహ్మాండమైన బ్రహ్మసత్ర ముగ మారినది. ఇప్పుడు మద్రాసులో సుమారు పన్నెండులక్షల జనాభాగలదు. ఈ జనాభాకు తగిన మరణములుకూడ గలవు; గనుక ప్రతిదినము ఈ బ్రహ్మసత్రము నందు పది పన్నెండుకర్మలు జరుగుచున్నవి. వీరందరికి ఇక్కడ తగువసతులు యేర్పాట్లు గలవు. అందరికి కావలసిన పాత్రసామానులుకూడ యిక్కడ యిచ్చెదరు. కొందరు ధనికుల కర్మలను ఇక్కడ జరిపించినపిమ్మట చనిపోయిన వారిపేరట ఒక చిన్నయింటిని ఈతోటలో కట్టించియిచ్చెదరు. ఈప్రకారము ఈతోటలో వసతులు పెరిగిపోవుచున్నవి.

పల్లెటూళ్లలో చనిపోయినవారి కర్మచేయించుటకు, బ్రాహ్మణార్థములకు ముత్తైదువులు మొదలగు వార్లకు చాల కష్టపడవలయును. ఈ బ్రహ్మతీర్థమునందు ఆలాటి కష్టములు పడవలసిన పనిలేదు. పురోహితులు, బ్రాహ్మణార్థపు బ్రాహ్మణులు, ముత్తైదువులు, దానములను పట్టువారు వీరందరూకూడ అక్కడ హాజరుగనుందురు. పది కర్మాంతరములకు సరిపోవువారందరు ఇక్కడ సులభముగ లభించెదరు. కర్మచేయుయజమాని స్నానముచేయుటకు ఇక్కడ గుంటగలదు. పురోహితునకు కావలసిన దర్భ ఈతోటలోనే పెంచుదురు. సమిథల పుల్లలుదొరుకు వృక్షములన్నియు ఈ తోటలోనే యున్నవి. శిలా ప్రతిష్టకు మంచిరాళ్లు యిక్కడనే దొరకును. కర్మనంతయు కంట్రాక్టుకుతీసుకొని జరిపించే పురోహితులుకూడ ఇక్కడవున్నారు. నిత్యకర్మ చేయునప్పుడు పిండమును తినుటకు చనిపోయినవారిని స్మరించి కాకులను పిలువ నవసరములేదు. ఇక్కడనే చెట్లమీద వేలువేలు పెంపుడు కాకులున్నవి. ప్రతిదినము పిండములను తినుచు చెట్లమీదనే కాపురముచేయు ఈ కాకులు బలిసియుండును.

మద్రాసులో, భర్తచనిపోయిన స్త్రీని కాపురముండు యింటికిరానివ్వరు. గనుక ఈ స్త్రీలకు బ్రహ్మతీర్థమునగల ఇండ్లు చాల వసతిగను మహోపకారముగను నున్నవి.

ఈలాటి ధర్మములనుచేసిన పుణ్యపురుషులే నిజముగ సంఘసేవకులు.

ఈ సందర్భమున నేనొక చిన్నవిషయమును వ్రాసెదను.

బరంపురం కాపురస్థులగు మారెళ్ల గంగరాజుగారు మద్రాసుకువచ్చి డాక్టరు రంగాచారి నర్సింగుహోములోచేరి వ్రణచికిత్సను పొందుచుండిరి. వారివ్రణమును ఆపరేషను చేసిన పిమ్మట ఆ నర్సింగుహోములోనే వారుచనిపోయిరి. వారిభార్య, కొడుకు వగైరాలు వారితో కూడనే మద్రాసునందుండిరి. వారిబంధువులుకూడ మద్రాసులో కొందరుండిరి. గంగరాజుగారు నాకు స్నేహితులగుటవలన నేనుకూడ ఆ సమయమున వారితోకూడ ఉంటిని. వారు యీవూరికి క్రొత్తఅగుటవలన దహనసంచయనాది కార్యములకు నేను సహాయపడి ముగింపించితిని.

వారిభార్య అప్పుడు వైద్యశాలను విడిచిపెట్టవలసివచ్చినది. ఆమె వుండుటకు మద్రాసులో స్థలము దొరకదాయెను. ఆమె దగ్గరబంధువులుకూడ ఆమెను వారిండ్లకు తీసుకొనిపోరైరి. అప్పుడామెను నాయింటికి తీసికొనిపోయి ఆదరించితిని. వారిబంధువులు యితరులుకూడ ఆమెను నాయింటికి తీసుకపోకూడదని నాకు బోధించిరిగాని నేనువినలేదు. నేను నాయింటికి తీసుక రాకుండిన ఆమెగతి యేమికావలయునో? మన సంఘములో నున్న ఇటువంటి దురాచారములను అడుగంటునట్లు చేయుటయే సంఘసేవ.

ఆమెను నా యింటికి తీసుకపోయిన నా యింటిలో కీడు సంభవించునని బోధించిన వారు ఇప్పుడు లేరుగాని నేనున్నాను; ఆతల్లికూడ సుఖముగ బిడ్డలతోకూడ బరంపురంలో యున్నది. ఈమె కాకినాడ కాపురస్థులగు గతించిన పోతాప్రగడ బ్రహ్మానందరావుగారి పెద్దకుమార్తె.

## కాఫీక్లబ్బులు

పూర్వము మద్రాసులో కాఫీక్లబ్బులు చెప్పదగినవి లేవనియే చెప్పవలయును నేను క్రొత్తగనుక మద్రాసుకువచ్చినప్పుడు అక్కడక్కడ చిన్నయిండ్లలోను వరాండాల లోను వెదురుతడికలను అడ్డముకట్టి మామిడిపలకల బెంచీలనువేసి బ్రాహ్మణులకు లోపలను, తదితరులకు వెలుపలను కూర్చుండుటకు యేర్పాటుచేసియుండేవారు. అప్పుడు వారిచ్చు కాఫీ పేరునకు కాఫీగాని కాఫీవాసనకూడ లేకుండెను. ఆ కాఫీని మురికిలోటాలలో పోసియిచ్చుచుండిరి. వడలు, దోసెలు, మురుకులు, పుళిహోర, పెరుగుఅన్నము, పెరుగువడలు మొదలగు ఫలహారములను యెండుటాకులలోపెట్టి యిచ్చుచుండిరి. దాహము కావలసియుండినవారు లోటాతో కొళాయిలో నీరు పట్టుకొని త్రాగవలసినదే. నేను ఒకనాడు కొత్వాలుచావడికి సమీపమునుండు ఆదియప్పనాయునివీధిలో పోవు చుండగ యొకయింటిముందర కాఫీక్లబ్బుబోర్డును చూచితిని. ఆ బోర్డుక్రింద ఇక్కడ

"తిరువణ్ణారము" అమ్మబడునని వ్రాసివుండెను. ఆ తిరువణ్ణారమన స్నేపలు ఫలహారము యేమో రుచిచూడవలయుననే ఆశతో క్లబ్బులోపలికిపోయి ఒక తిరువణ్ణారమును యివ్వమని అడిగితిని. అప్పుడాయన నూనెకంపుకొట్టుచుండిన గారెను తెచ్చియిచ్చెను. దానివెల కాని యనిచెప్పెను. ఆవడను యెండుఆకులోపెట్టి మడిచి నూలునుచుట్టి నాచేతులోపెట్టెను. ఈ తిరువణ్ణారమును తుంచి నోటిలోవేసుకొని రుచిచూచితిని. అది పాసినకంపు, నూనె కంపు కొట్టినందున వెంటనే వీధిలోపడవేసితిని. ఈ క్లబ్బులను నడుపువారు ఆకాలమున వైష్ణవులుగనుండిరి. ఇది అప్పటి కాఫీక్లబ్బులరీతి.

## పాత బిచ్చగాండ్రు

మద్రాసులో నాటినుండి నేటివరకు పలువిధములగు బిచ్చగాండ్రు కన్పించుచున్నారు. వీరిలో న్యాయముగ పరుల దానధర్మములపై తప్పనిసరిగా బ్రతుకవలసిన దౌర్భాగ్యులేగాక-కృత్రిమ సంపాద్యపరులు పలువురున్నారు. ఆరోజులలోను మరకాళ్లను కట్టుకొని బిచ్చమెత్తేవారుండిరి. లక్క-బొమ్మలను చేతికితగిలించుకొని ఆడించుచు వినోదముకల్పించి బిచ్చమడిగే ఆడవారున్నూ తిరిగేవారు. తురకకొజ్జాలనే నపుంసకులు, మద్దెలతాళములతో ఆటపాటల ప్రదర్శించుచు ఇండ్లకువచ్చి బిచ్చమెత్తుకునేవారు. కొజ్జాలనగ తురకలలో మగవారైయుండిన్నీ ఆడువారివలె వేషభాషలననుకరించే యొక విధమగు నపుంసకులు. వీరు నవాబుల అంతఃపురములలో ఘోషాస్త్రీలకు పరిచారకులుగా నుందురు. వీరి ఆటపాటలు, కొంత వెక్కసముగనున్నను పలువురు సామాన్యుల కానందదాయకమైయుండెడివి. కండ్లకుసుర్మా, పండ్లకుదాసిన, కొప్పునపూలు, ధరించి, నడుమునకు పావడగట్టుకొని కులుకుచు, నవ్వుచు పురుషులతో సరసములాడుచు, మొగమొక్కట్లు, ఆడుచందములుగల వీరు హాస్యనిలయములైయుందురు. ఇద్దరు ఎరుకలస్త్రీలు తాటాకుగిలకలను అమ్ముకొనుచు, వీధులలో మాతులు పొడుచుకొనుచు సవతులు జగడమాడు దృశ్యమునుచూపి చూపరుల వినోదపరచి బియ్యమడుగుకొనేవారు. గారడి విద్యలను, దొమ్మరిఆటలను మద్రాసు నడివీధులలోచూపి బిచ్చమెత్తువారు కొందరు వచ్చుచుండిరి. పగటివేషములువేసుకొని మోటహాస్యమును చెప్పుచు బిచ్చమునకు వచ్చువారును కన్పించుచుండిరి. అప్పుడప్పుడు ఆంధ్రదేశమునుండి మరుగుజ్జువస్తాదులు కొందరు వచ్చి కట్టెలు కత్తులు త్రిప్పుచు సాముగరడీలను చేసిచూపి బిచ్చముఅడిగేవారు. ఒకజంగం భద్రప్ప పెద్దగంటను చేతపట్టుకొని, మరియొకచేత ఆగంటఅంచును పుల్లతోచుట్టుచుండగా గంటనాలుక గణగణకొట్టుకొను దృశ్యము చూడ చిత్రముగా నుండెడిది. ఒక తెలుగు బిచ్చగాడు బొద్దికూరఅమ్ముచు - "బొద్దికూరతిన్నవారు బుద్ధిమంతులు అగుదురు; చక్క

లాలుతిన్నవారు చచ్చిపోదురు''-(అతడు యతికొరకట్లన్నాడేగాని ఇది వాస్తవము కాదు. గృ॥ సం.) అనే పాటపాడుకొంటూ తిరిగేవాడు. కాలిమీద మాంసపుతునకనుపెట్టి కట్టు కట్టుకొని పరుండి లేవలేనట్లుగ అభినయించు బూటకపు బిచ్చగాండ్లు-మరి అనేక కృత్రిమ బిచ్చగాండ్లును అప్పటినుండి యిప్పటివరకు ముక్కోటియేకాదశినాడు మద్రాసుదేవాలయ ములలో చూచుచునేయున్నాను.

మద్రాసులో మంచినీరు

నేడు మద్రాసులో సుమారు 16 లక్షుల జనమున్నారనవచ్చును. ఈఫిబ్రవరి 1 వ తేదినుండి 160 లక్షుల గాలన్లనీళ్లనుమాత్రమే ప్రతిరోజు కార్పొరేషన్‌వారు సప్లైచేయ గలుగుచున్నారు. అనగా తల 1 కి 10 గాలన్లు లేక 2½ కిర్సనాయల్‌డబ్బాల నీరు మాత్రమే. మద్రాసులో నేడు ఎక్కడచూచినను నీటిఎద్దడి కబుర్లే. అయితే ఈస్థితి ఇటీవల జనము హెచ్చుటచేత కలిగిన క్రొత్తసమస్యకాదు. ఇది మద్రాసు పుట్టిననాటనుం డియు ఉన్నదే. 1718లోనే "కోటకు మైలులోపల త్రాగుటకు నీరుదొరకదు"-అని యొక పాశ్చాత్యుడు వ్రాసియున్నాడు. ఆరోజులలో పెద్దినాయునిపేట ఉత్తరభాగముననున్న బావులనీటిని ఎద్దులపై సిద్దెలతోతెచ్చి అమ్మేవారు. 2 దుడ్డులకు ఒక్కబిందెడునీళ్లు అమ్మేవారు. దుడ్డు అనగా 5 రాగికాసులు లేక 2 పైసలు. ఈనీరు చాల చల్లగాను, హితవుగాను ఉండేవట. సెంట్‌థామస్‌ మౌంటులో దొరుకు నీరువలె ఉండేవని ఆ రోజులలో వాటికి ప్రతీతి.

క్రమతః జనాభివృద్ధిఅయినది. 1770 ప్రాంతంలో నీటిఎద్దడివల్ల ఊరిలో కలరా జాడ్యము చెలరేగినది. 1772 లో పెద్దినాయకునిపేటలో ఉండే 7 బావులనుండి కోటకు (రెండుమైళ్లదూరము) (సముద్రమున కొక్కమైలుదూరము) మంచినీరు సప్లైచేసే స్కీము నేర్పాటుచేసిరి.

ఏడు బావులు

నిజమునకివి 10 బావులు. ఈబావులన్నియు 16 అ॥ల మధ్య కొలతగలవి. 23 మొ 29 అడుగులలోతు. పికోటాలతో నీరుపైకితెచ్చి ఎత్తునగట్టిన తొట్ల నిలువచేసి-యంత్రసాధనమున వడియగట్టుట కేర్పాటు. అట్లు వడియగట్టిన నీటిని పెద్ద గొట్టముల ద్వారా కోటలోను వెలుపలను యున్న మిలిటరీ వారికి నీటిసప్లై చేయుచుండిరి. ఈ బావులలో నీరు ఎప్పుడూ సమృద్ధే. మరి ఒక్క శతాబ్దమునకుగాని ఎర్రకొండల చెరువు (Red Hills Tank) ఏర్పాటు జరుగలేదు. ఆ శతాబ్ద కాలములో నిరంతరం ఈ బావులు నీటిని సప్లైచేసినా నీరు తరుగలేదు. 1885 లో గాలివానవచ్చి ఎర్ర కొండల

చెరువువద్ద యంత్రములు చెడిపోయినప్పుడు 10 రోజులు నగరమున చాలమందికి ఈ నీరు సప్లై అయినది.

1783—87 సం॥ల మధ్య ఈ ఏడుబావుల నీటినే కొళాయిలద్వారా కోటలోను వెలుపలను మిలిటరీ కానివారి ఇండ్లకును సప్లైచేసిరికాని దీనిని యూరపియనులు, హైందవులునుకూడా ఇష్టపడలేదు. యూరపియనులు బహుశా తమకు నీరు తగ్గునని తలచి యుందురు. హైందవులు-యంత్రములలో సప్లైఅయ్యేనీరు—అనాచారమని ఇష్టపడకుండిరట. పురాతనముగా, దూరమైనా, తాము తెప్పించుకొనే మంచినీరే తెప్పించుకొని త్రాగుట, తమ దొడ్లలోనుండు బావులలోని నీరే వాడుకొనుటవిడువకుండిరి.

నేను మద్రాసునకు వచ్చుటకు ముందుఉన్న పరిస్థితులు దుర్భరముగా ఉండేవట. పట్నం విస్తారంగా పెరిగినది. పరిసరములగల 16 గ్రామములుకలిసి పట్నమైనది. 1871 జనాభా లెఖలలో (అదియే వాస్తవమైన మొదటి జనాభాలెఖ) — 4 లక్షలదాకా జనాభా కన్పించుచున్నది. అయితే శతాబ్దమునాడున్న నీటి వసతేగాని క్రొత్తవసతి యేమియు యేర్పడలేదు. దూరాభారమునుండి నీరు తెచ్చుకోలేనివారు, స్వంతబావులు లేనివారు అయిన పేదసాదలేగాక, అగ్రజాతులవారుకూడా దేవాలయముల నంటిన చెరువులలోను కోనేళ్లలోను నీరు వాడుకొనేవారు. ఆ కోనేట్లోనే బట్టలుతికి అందే స్నానముచేసి, అందే శుభ్రముగా తోమిన వెండి, రాగి, ఇత్తళి బిందెలతో ఆ నీరే తడిగుడ్డలతో మడిగా ఇంటికి తెచ్చుకొని త్రాగేవారు. ఆ నీరెట్లుండెనో నాటి యక్జిక్యుటివ్ ఇంజనీయర్ స్టాండిష్ అనే దొర ఇట్లు వర్ణించియున్నాడు :

దేవాలయములంటి ఉండే చెరువులు కోనేళ్లు మున్నగు జలాశయములలో నీరెంత అపరిశుభ్రమో నేనిటీవలగాని చూడడం తటస్థించలేదు; వీటినే ముఖ్యముగా అగ్రజాతులవారుతెచ్చి వాడుకుంటున్నారు. కచాలేశ్వర దేవాలయంలో కోనేరున్నది. అందలి నీటిపై పచ్చగా అట్టవలె పాచి పేరుకొన్నది; బహుకళ్మలమైన మురుగు నీటి కాలువలోకూడనే నంతటి పాచి పేరుకొనుట చూచియుండలేదు. అయినా ఆ నీటిలో స్నానము చేసేవారున్నూ ఉండేవారు.

ఇట్లుండగా నీటి యెద్దడి తీర్చుటకున్నూ, పరిశుభ్రమైన నీటిని సప్లైచేయుటకున్నూ, — ప్రభుత్వమువారు 1861 నుండి ఆలోచన లారంభించిరి. స్కీములువేసిరి. ఏడుబావులనీరున్నూ పరీక్షచేయించి, అందులోకూడ అపరిశుభ్రతయున్నదని అనుమానించిరి. కడకు ఎర్రకొండల చెరువు, చోళవరం పంటచెరువులు కలిపిన స్కీము 1866 లో అంగీకృతమై ఆరేండ్లలో ముగిసినది. ఆ చెరువునుండి శాస్త్రపద్ధతిని నీరుతెచ్చి కీలుపాకులో—సముద్ర మట్టమునకు 44 అడుగుల ఎత్తున ట్యాంకులుకట్టి నీరు నిల్వచేసి - వడియగట్టి - ఊరికి సప్లైచేయ నారంభించిరి. ఇది 13-5-1872 న గవర్నరు నేపియర్ చే ప్రారంభింపబడినది.

అనగా నాపుటుకలతో ప్రారంభమైన కొళాయినీరు నేను మద్రాసు వచ్చేటప్పటికి బాగా వ్యాప్తిలోనికి వచ్చినది. కాని కొళాయిలలో వచ్చేనీరు పరిశుభ్రముగా నుండేవి కావు. నీళ్లతోకూడ చిన్నపురుగులు చేపలు వగైరా జీవములు వచ్చుచుండెను. ఆ కారణమున మద్రాసులోయున్న ధనికులు కొందరు పేరుపొందిన కొండూరు బావి నీరును (విల్లివాకం), టాకరు సత్రమునసుండు బావి నీరును తెప్పించుకొని త్రాగేవారు. ఈ రెండు స్థళములనుండు నీరు చాల ఆరోగ్యకరమని ఆ కాలపు డాక్టర్లు చెప్పుచుండిరి. ఈ బావుల నీటిని బ్రాహ్మణులు పీపాయిలలో తీసుకొనివచ్చి కావలసిన వారికి బిందె 1 కి అణావంతున ఇంటింటికి ఇచ్చి పోవుచుండిరి.

1940-41 లలో మద్రాసులో నీటి సప్లై వృద్ధిచేయుటకై ఎర్రరాళ్ల చెరువునకు తోడు పూండి చెరువును చేర్చిరి. కాని ఈ లోపల జనము రెండు రెట్లకుమించి పోయినది. కావున మనిషి 1 కి నేడు ఒక్క కిరసనాయిలు డబ్బాడు నీళ్లు దొరుకుట దుర్లభమైనది. ఇక ఆలోచనలోనున్న కృష్ణా పెన్నారు ప్రాజక్టుస్కీము అమలు జరుగుచో మద్రాసునకు నీటికరవు ఉండదుఅని చెప్పుచున్నారు. కావచ్చును; కాని ఆ స్కీము ఇంతలో అమలుజరుగునా యనికూడ నాఅనుమానము. దీనికి రెండు ప్రతిబంధకములేర్పడి యున్నవి. రామపాదసాగర ప్రాజక్టు ఏర్పడి గోదావరి నీరు కృష్ణకు వచ్చినగాని ఈ స్కీము అమలుజరుగుటకు తగినంత పుష్కలముగ కృష్ణనుండి పెన్నకు నీరు రాజాలదు-అని తెలిసిన వారనుచున్నారు. అయితే జరుగుచున్న ప్రయత్నము ఆ రామపాదసాగరమును వెనుకకునెట్టి ఈ క్రొత్త స్కీము సాగించవలెనని యున్నట్లు కన్పించుచున్నది. రెండవది: ఈ స్కీము అమలు జరిగిన పులివెందల, రాజంపేట తాలూకాలలోని పంటభూములు, పండ్లతోటలు ముంపు అగునని వారు గోలబెట్టుచున్నారు.

శ్రీ వి. డి. కృష్ణస్వామి ఎం. ఏ. (కాంటబ్) గారు ఈ విషయమై చర్చించి 1939 లో ఇట్లు వ్రాసియున్నారు:—

“కాబట్టి 1639 లో ఆంగ్లేయు లిక్కడ నివాసమేర్పరచుకొనుట కేవలము గ్రుడ్డితనము; ఏలనంటే నాటినుండి నేటివరకు నీటికొరకు దేవులాడడంతప్ప - ఈ సమస్య పరిష్కారమయ్యే సాధనమింకా కన్పించలేదు.” 1949 లోను అదేపరిస్థితులలోనున్నాము.

మద్రాసు నగర మధ్యమున కూవము అని యొకనది పారుచున్నది. అది దుర్గంధమును వెదజల్లుటకుతప్ప మరెందుకు పనికిరాదు. నేను ఇచ్చటికి వచ్చినది మొదలు ఎన్నియో మార్పులు చెందినవి. కాని ఏమాత్రము మార్పుచెందనివి మూడు: కొళాయిలలో అపరిశుభ్రమైన నీరు; కూవమునది దుర్గంధము; దేవాలయపు కోనేళ్లలో పేరుకొన్నపాచి. వీని కెప్పటికైన మార్పువచ్చునో, రాదో?

(సశేషము)






# అందమైన కోమల వదనపు
## రహస్యము...
## ...పాండ్స్ రెండు క్రీములు

అందమైన ముఖకాంతిని పొందుటకు మీరు రెండు విధములుగా జాగ్రత్త తీసు కొనవలెను, రాత్రి మరియు ఉదయము. రాత్రి-కొన్ని నూనెల అతి సూక్ష్మమైన కలయిక వలన తయారైన పాండ్స్ కోల్డ్ క్రీము, మీ ముఖమును శుభ్రపరచుటకు. పగలు-చల్లని, తేలికయైన పాండ్స్ వ్యానిషింగ్ క్రీము, తీవ్రమైన సూర్య రశ్మినుండి మీ ముఖకాంతి నల్లబడకుండ రక్షణమొసగుటకు.

ఇదిగో, ముఖకాంతిని రెండు విధములుగా కాపాడు దినక్రమము!

ప్రతి రాత్రి : మీ ముఖమునకు పాండ్స్ కోల్డ్ క్రీమును అంటించి చర్మరంధ్రములలో దూరు ... తరువాత తుడిచివేయుము. మీ ముఖము తేటగా ప్రకాశించుట చూడుడు!

ప్రతి ఉదయము : పాండ్స్ వ్యానిషింగ్ క్రీమును అంటించుము. ముఖమునందంతట మెల్లగా జారి అదృశ్యమగును. కంటికి కనని పొరవలెనుండి దినమంతయు మీ సౌందర్యమును కాపాడును.



ముఖసౌందర్యపు కళంక మునకు కారణములు:

# పాండ్స్

వ్యాపార ప్రతినిధులు : యల్. డి. పేమూర్ అండ్ కం., (ఇండియా) లి.
బొంబాయి, కలకత్తా, ఢిల్లీ, మద్రాసు, ..., కరాచీ, కొలంబో, రంగూన్.




తంగేడు:- ఈ చిన్న చెట్టు ఏ పోరంబోకు భూములయందును కంచెలయందును, విశాల ప్రదేశములయందును కానుపించును. దీని పుష్పములు బంగారును మించి పసిమిగాయుండును. పుష్పమును చూచిన తురాయి అవునేమో యనిపించును.

పుష్పదళములను బాగుగ విడదీసి యెండబెట్టి చూర్ణమును చేయవలయును.

| | |
|---|---|
| తంగేడు పుష్పదళచూర్ణము | ½ తు. |
| ధనియాలపొడి | ¼ తు. |
| యాలక్కాయల చూర్ణము | ¼ తు. |
| శొంఠి చూర్ణము | ¼ తు. |
| రోజాపుష్పముల చూర్ణము | ¼ తు. |

వీటినన్నిటిని చేర్చి కాఫీపొడిగ తయారుచేసుకొని కాఫీవలెనే కాచి పంచదార కల్పి సేవించిన స్త్రీలకు సామాన్యముగ కానుపించు ప్రదరములు నెమ్మదించును. శోష వుండదు. శాంతియుతముగ నుండును.

పిల్లలకు:- స్నానములకు ఉపయోగించు నలుగుపిండి, సున్నిపిండిలో యీపుష్పదళ చూర్ణమును మాత్రం ఉపయోగించిన శరీరము కాంతియుతముగ నుండును.

| | |
|---|---|
| తంగేడు విత్తులు | 1 తు. |
| మానిపసుపు | 1 తు. |
| త్రిఫలముల చూర్ణము | 1 తు. |

ప్రతిఉదయము కషాయము మాదిరిగ కాచి ఉదయం సాయంత్రములయందు తడవ కొక అర ఔన్సు చొప్పున పుచ్చుకొనిన సమస్త మధుమేహములు శాంతించును. మూత్రములోని చక్కెర (Sugar) ను తగ్గించును. అలసటను, శరీర దుర్గంధమును పోగొట్టును.

సామాన్యముగ 40 సంవత్సరములు దాటిన కొంతమంది స్త్రీలకు, పెక్కుసంతానవంతురాండ్రకు మూత్రాశయ వ్యాధులు పలువిధముల బాధించును. అట్టి వారికి ఇది చాలా ఉపయోగకరము. అనుభవసిద్ధము.

సీతాఫలం:- రెండువిధములు (చిన్నగింజలు పెద్దగింజలు కలిగియుండును). రుచి సువాసన, గుజ్జు కలిగియుండును.

దీని ముఖ్యగుణములు అందరకు తెలియవు. సీతాఫలం విత్తనములలోను విష కురుపులను మాన్పునట్టి అత్యద్భుతశక్తికలదని శాస్త్రజ్ఞులు కనుగొన్నారు.

నారి కురుపులకు దీని విత్తనములు మెత్తగ ఆముదముతో కలియ నూరి కురుపు వుండు స్థలమునకు చాలినంతబిళ్ల చేసి వేసి కట్టుకట్టిన త్వరలో విషక్రిమినారి సంపూర్తిగా నశించి నెమ్మదగును. పల్లెగ్రామములయందు వైద్యసహాయమున్నను ఇట్టి దుష్టవ్యాధులకు తగిన సదుపాయములు సామాన్యముగా లభించుటకష్టము. వైద్యులు వృత్తిరీత్యా దీనికి వైద్యముచేయుట అరుదు. ఇది బీదలను పీల్చి పిప్పిచేయును. దుమ్ము పొలములలో పనిచేయు సేద్యగాండ్రకు నారి కురుపులు సంభవించుచుండును. గాన అములులో పెట్టి అందరకు సహాయపడునట్లు ఉపయోగించుకొనవలయును.








నెల్లూరిలో పల్లికొండ శ్రీ రంగనాథస్వామివారి ఆరగింపునకై చేయబడు పాక విశేషములు (గతసంచికలలో ప్రస్తావింపబడినవి గాక).

## బకాళా భాత్

ఇది దధ్యోదనము వంటిదేయగు నొకపాక విశేషము. అయితే అంతకంటే పలచనగాయుండి గిన్నెలో పోసుకొని త్రాగుటకును వీలుగానుండును. దీనిలో దధ్యోదనపు వస్తువులేగాక వెన్నయు నధికముగా తగుమాత్రము బాగుగా కలిసేటట్లు కలుపుదురు. పెరుగు మంచిదిగా నుండవలెను.

### దీనికి తళియ 1 కి

| | | | |
|---|---|---|---|
| బియ్యం | 3½ శేర్లు | ఎండుమిరపకాయలు | 5 పలములు |
| పెరుగు | 35 శేర్లు | పచ్చికరివేపాకు | చాలినంత |
| పచ్చిమిరపకాయలు | 7½ పలములు. | మామిడికాయలు | 10 |
| ఆవాలు | 7½ పలములు | మినప పప్పు | ½ శేరు. |
| మెంతులు | తగినట్లు | ఇంగువ | 1 పలము. |
| అల్లం | 5 పలములు | ఉప్పు | ½ శేరు. |
| శొంఠి | 5 పలములు | నెయ్యి | 7½ పలములు. |

దీనికి అన్నము కొంచము మెత్తగానుండునట్లు వండి పెరుగులో బాగుగా పిసికి కలిసిపోవునట్లు చేయవలెను. కొంచము వెన్నకూడా చేర్చవలయును.

## ఇడ్డెన (ఇడ్డలి)

| | | | |
|---|---|---|---|
| బియ్యం | ¾ శేరు. | శొంఠి | 1 పలము. |
| మినప పప్పు | ¾ శేరు | నెయ్యి | 8 పలములు. |
| మెంతులు | 1 పలము. | | |
| మిరియాలు | 1 పలము. | ఉప్పు | 1/8 శేరు. |
| జీలకఱ్ఱ | 1 పలము. | పెరుగు | 1 శేరు. |
| ఇంగువ | ½ పలము. | కరివేపాకు | చాలినంత. |

దీనిలో—బియ్యమును నానబోసి దంచవలెను. మినపపప్పును సన్నన్నూకగా విసరవలయును. ఈ రెంటినికలిపి కొంచము పెరుగున్నూపోసి పులియబెట్టవలయును. దానిలో పేరిన నెయ్యికూడా కలపవలెను. అట్లని ఒకపూట పులిసిన పిదప ఆపిండిలో పై ఇతర రసవర్గములు పొడిచేసి కలపవలెను. మిరియాలు అట్లేవేయుదురు. కరివేపాకున్నూ ఆకు వలిచి కలుపుదురు.

ఇడ్డెనపాత్రలో ఉంచబడు సన్న రంధ్రములుగల గుంటలరేకులో పలచని తడిగుడ్డ పేలికలుంచి ఆ పేలికలపై గుంటలనిండ—పైవిధముగా తయారుచేయబడ్డ పులిసినపిండిని పోయవలెను. అట్టిరేకును ఇడ్డెనపాత్రలో అమర్చి—మూతబెట్టి ఆవిరిపై ఉడికించవలెను. అట్లు ఇడ్డెనపాత్రలేనిచో జోడితపిలె మోస్తరుగా సన్నవెదురు పేళ్లబుట్టలు (అనగ Cylindrical గా యుండెడివి.) పదిఅంగుళములు లోతు, నాలుగు అంగుళములు వ్యాసము (diameter) కలబుట్టలు అల్లించుకొని దాని లోతట్టు లేత అరటిఆకు చుట్టువచ్చేటట్లువేసి, ఇడ్డెనపిండి ఆ బుట్టలనిండుగవేసి ఆబుట్టలకు త్రాళ్లుగట్టి - ఇడ్డెనపాత్రపైమూతకు ఆ త్రాళ్లతో బుట్టలనువ్రేలాడగట్టి ఆవిరి పారించవలెను. ఆబుట్టలు పాత్రలోని నీళ్లకు తగులకుండా, నీళ్లు తుక తుక ఉడుకుచో పొంగులు వచ్చినను తగులకుండ, ఎత్తుగ వ్రేలగట్టవలయును. ఈపిండిలో పేరిన నేయి కలిసియున్నది గనుక ఆవిరిపారిన తరువాత ఇడ్డెన నాలుగు దినములుకూడా బాగుండును: పాసిపోదు. ఎండినకొలది పొడియగును; రుచిగనేయుండును.

## అక్కారవడిశల్

ఇది యొకవిధమగు పరమాన్నము. శేరు 1 కి పాళ్లు.

| | | | |
|---|---|---|---|
| బియ్యము లేక బియ్యపునూక | ½ శేరు. | జీడిపప్పు | 5 పలములు. |
| చాయపెసలపప్పు | ½ శేరు. | ద్రాక్ష | 2 పలములు. |
| బెల్లం లేక చక్కెర | 1¼ వీశ. | నెయ్యి | 5 పలములు. |
| చిక్కని పాలు | 2 శేర్లు. | యాలకాయలు | ½ పలము. |

తగుమాత్రముగ పచ్చకర్పూరము. కుంకుమపువ్వు.

బియ్యము లేక బియ్యపునూకయు పెసలపప్పును పాలలో కలిసిపోవునట్లు మెత్తగ యుడికించవలెను. పాలతోకూడ అది యుడుకుచుండగా మిగత రసవర్గములన్నియు అందు చేర్చవలయును. దీనిని సాధారణముగ ధనుర్మాసపు పూజాకాలమున నైవేద్యమునకు పొద్దుటిపూట చేయుదురు. ఆ చలిరోజులలో వైష్ణవస్వాములు శీతలోదకస్నానమొనర్చి, గండభేరుండపు అంచుల మడుగు ధోవతులుగట్టి నడికట్లు బిగించి, ద్వాదశోర్ధ్వ పుండ్రధారులై చిన్న చిప్పలతో, ఆకుదొప్పలతో, దేవాలయములకు వేంచేసి గోష్ఠీవినియోగ సందర్భమున ఆయా గిన్నెల, దొన్నెల పోయించుకొని, విశిష్టాద్వైత సూక్తులు సాయించుచు చలిదీర నీ పరమాన్నమును సాపడుదురు.

 

# బ్రతుకుతెరువు



(గతసంచిక శేషము)

గతసంచికయందు మీరాబెన్ కూరగాయలను పెంచుటకుమడులెట్లు చేయవలెనని చెప్పెనో వివరించితిమి. పిదప కూరకాయలను పెంచుటనుగూర్చి ఇట్లు వివరించినది —

(1) కారట్లు (2) టర్నిప్పులు (3) రాడిష్‌లు (4) స్పైనేక్ అను నీ నాలుగు కూరలు పండించు విధానము: (ఈ నాలుగు కూరలు పాశ్చాత్యదేశములనుండి మనకు దిగుమతి యైనవి. కాని మనదేశమున విరివిగా నేడు పంట పెట్టబడుచున్నవి. సామాన్యకుటుంబములును వీనిని నేడు వండి తిన నేర్చి యున్నారు.)

(1) కారట్లు: వెనుక చెప్పిన విధముగా మడులు తయారుచేయుము. కారట్లు విత్తుటకుముందు మట్టినిగుచ్చెత్తి చదునుచేయుము. అంతట విత్తనముల కారట్‌లను అడ్డముగ వండబెట్టి పూడ్చుము. ఆ ఎదబెట్టుటలో అంత దగ్గరగాకుండా అంత దూరముగాకుండా చూడవలయును. సమముగా వాని నుంచవలయును. ఎదబెట్టుట అయినపిదప-వ్రేళ్లతోగాని, చిన్న దంతెతోగాని, చాళ్లుచాళ్లుగా మడిని పైపైన దున్నినట్లుచేయుము. నీరు తుంపరలుగాపడు డబ్బాతోగాని, చిల్లుల కుండతోగాని,-నీరు చల్లగా చల్లుము. మొలకలెత్తి వేరు గట్టిగా పారువరకు-కాలువలగుండా మళ్లకు నీరు పారించరాదు; అప్పుడే పారించినచో లోపలి విత్తనాల దుంపలన్నియు మడిలో అంచుకు పోయి అక్కడ గుంపుగా గుమికూడుకొని మొలుచును. నీరు మడిలో ప్రవేశించుచోట ఖాళీస్థలమగును. ముందు రోజులలో తరచు కొద్దికొద్దిగా నీరు పెట్టుచుండవలయును; నేల కొద్దిగా చెమ్మగా ఉండునట్లు చూడవలయును. మొక్కలు పెద్దవైనపిదప కొంత సావకాశముతో ఒద్దుగా నీరు చల్లవలెను. మొక్కలు మొలిచిన పిదప అవి గుంపుగా ఉన్నట్లైతే పలచన చేయవలయును. ఏలనంటే వేరులు ధారాళముగా పారి దుంపలు బాగా పుష్టిచెందుటకు అవకాశ ముండదు.

(2) టర్నిప్పులు: కారట్లకువలెనే వీనికి మడులు తయారుచేయుము. అయితే టర్నిప్‌లు ఎదపెట్టరాదు. జాగ్రత్తగా భూమిలోనే ¼ అంగుళము లోతున పూడ్చిపెట్టి మన్ను వేయవలెను. పైనవేసిన మన్నును అదుమరాదు. ఒక్కొక్కవిత్తనమునకు— 5 అం॥ల జాగా మధ్యనుండవలయును. నీరు చల్లుట పారించుట కారట్లకు వలెనే చేయవలయును. ఇక్కడ ఒద్దుగ నున్నను పల్చన చేయనక్కర లేదు.

(3) రాడిష్లు: వీనినికూడా టర్నిప్లవలెనే పాతిపెట్టవలెను. అయితే వీనిని మడి లోకన్నను మడి అంచులందు లేక గట్లమీద పాతవలెను. ఇతర మొక్కలు పైరుపెట్టిన మడులలో పాతిపెట్టదగును. గట్లమీదకూడ చిల్లుల డబ్బాతో నీళ్లు చల్లుచుండ వలయును. నీరు పారించినప్పుడు గట్టులో బాగుగా నీరు ఇంకవలయును.

(4) స్పైనేక్:—ఇదియు కారట్నువలెనే అడ్డముగా పైరు పెట్టవలెను. కారట్లు కన్నను సమీపముగాను పైరు పెట్టవలయును. బాగుగా నీరుపెట్టవలెను. ఒకే పంటకు 3, నాలుగుసార్లు కూర కోతకువచ్చును.

---

# ఇంటిపనులలో మెళకువలు

## తల్లిప్రేమ శిశుపోషణ

బిడ్డలు కావలెనని బిడ్డలకొరకు నోములునోచి, వ్రతములుపట్టి, ఎంతో తాపత్రయపడుతుంది ఆడ జీవితం. మగవానికి పిల్లలపిచ్చివుండదు. యింకా పిల్లలు పుట్టినందువల్ల, స్వేచ్ఛవుండదని, పిల్లలను పెంచడం కొరకు ఎంతో కష్టపడాలని అసలే ఆశించడు ఒక్కొక్క మగవాడు. ఆడప్రాణానికి పిల్లలే స్వర్గము, మోక్షము నని ఎన్నో దేవుళ్లకు మ్రొక్కి ఎంతో తపిస్తుంది. ఒక్కొక్క స్త్రీ కాపురానికి వచ్చిన దగ్గర నుండి, సంవత్సరాలు లెక్కపెట్టుకుంటూ, రెండేళ్లయింది, మూడేళ్లయింది, యిక పుట్టేదేమిటని, నిరుత్సాహ పడుతుంది. పూర్వమువలె యిప్పుడంతగా బాధపడవలసినది లేకుండగనే తొందరలోనే పుట్టి తల్లి అవుతు న్నారు, యీ కలికాలంలో. కాని నా సోదరీమణులు బిడ్డలకొరకు ఎంతగా పరితపిస్తారో, వాళ్లను పెంచ డములోకూడా తగు శ్రద్ధచూపుతూ, కనడమే మనవంతని, పెంచడము ఇతరులమీద పెట్టక, వేళకుఆహారము వేళకునిద్ర, మనబిడ్డలకు మనమే చేసుకోవడములో మనకేమంచిదని నేను మరొకమారు చెపుతాను. ఏమంటే, బిడ్డఆకలి, ఆరోగ్యము తల్లికి తెలిసినంత యితరులకు తెలియదు. శ్రీమంతులు బిడ్డలకు సంరక్షణ చేసుకొనే, విషయములో ఓపిక, ఓరిమిలేకయున్నా, వారికిచెయ్యవలసిన అవసరములేకను అనగా ఆయాలు, దాసీలు వుంటారుగాన ఏదో వాళ్లు పెంచుతారనే ధైర్యముతో, వాళ్లమీదనే వదిలి నిశ్చింతగావుంటారు. కాని బిడ్డల విషయములో మట్టుకు శ్రమయనక కష్టపడి తల్లులు పెంచుటే చాలామంచిది. బిడ్డల వుత్పత్తికి కారణరాలు స్త్రీయేకదా; అటువంటిది. బిడ్డలను ఆసక్తిగా, ఆరోగ్యముగా నుండేలాగు ఎందుకు శ్రమపడకూడదు? అది వకశ్రమకూడాకాదని చెప్పతాను. ఏమంటే, అది మనపని. బిడ్డపుట్టిన దగ్గరనుండి, వాళ్లకు చేయవలసిన పనులన్నీ మనకు తెలిసినంత మగవాళ్లకు తెలియవు. ఏవేళలో వాళ్లను ఎలాచూడాలో అన్నీ మనకే తెలుసు. ఆ విధముగా మనబిడ్డలను మనము ఎంతో ముద్దుగా ముచ్చటగా పెంచుకోవచ్చును. శ్రీమంతుల బిడ్డలు యితరుల చేతులమీద పెరుగుట వల్లను, అపురూపముగా పెరుగుటవల్లను, సామాన్యుల బిడ్డలకున్నంత బలము ఆరోగ్యముకన్న తక్కువగావుండి, ఎక్కువచురుకుగాను, బాగా బలంగానుఅగుపడక, ఏదో మాంద్య ముగానున్నట్లు అగుపడతారు. కాన తనబిడ్డలవిషయము తల్లే ఎక్కువశ్రద్ధతీసుకొని, అన్న, పానీయములలోను ఆహారవిహారములలోను, కంటికిరెప్పవలె కాపాడుతుంటే, ఆబిడ్డలు ఆయుర్వృద్ధిపొంది, ఆ తల్లిదండ్రులకే కాకుండా, దేశసేవకుకూడా వుపయోగపడి, పేరు కీర్తులుపొంది సుఖజీవులైయుంటారు. అటువంటి బిడ్డలను చూచిన ఆ తల్లితండ్రులు మనస్సు ఎంతో ఆనందములోనుండి, ఆబిడ్డల శౌర్య, ధైర్యాదులు, విని ఎంతో వుప్పొంగిపోతారు ఆ తల్లిదండ్రులు. కాన నాసోదరీమణులకు నేను ఎక్కువగాచెప్పే శక్తిలేక పోయినా, ముఖ్యముగా బిడ్డల విషయములో మట్టుకు చాలా శ్రద్ధాసక్తులుచూపి, విసుగుచెందక, ప్రేమ పూర్వకముగాను, హృదయపూర్వకముగాను, పెంచమని నాప్రార్థన. (అనగా) ఎవరిబిడ్డలు వాళ్లకుబరువా? యింతగా చెప్పవలయునాయని కొందరు సోదరీమణులకు నాపైకోపము రావచ్చును. కాని నేను చాలా చూచినందువల్ల ఇంతగా వ్రాయవలసి వచ్చినది. ఒక్కొక్కఆమె, ఒకరిద్దరు పిల్లలు పుట్టువరకు ఏదో కొంచము ఓపికగాను, శ్రద్ధగాను పెంచగలుగుతారు. అక్కడనుండి, పిల్లలపిచ్చివదిలి, ఏమెం ఎందుకు పుడుతున్నారో, ఎందుకు పెంచాలో అన్నట్లు, విసుక్కుంటూ, విసవిస లాడుతారు. ఆలా ఎప్పటికి బాధ పడకూడదు. మనలోఏమీలేదు. అంతాదైవచిత్తము. మనకు ప్రాప్తమున్నంతమందినే ప్రసాదిస్తాడు. అందరిని సమానమైన ప్రేమతోను, సమానమైన దృష్టితోను, పెంచవలెనేగాని, భేదభావములు చూపకూడదు. అది చాలా పాపహేతువు. యీ బిడ్డల పెంపకములో తల్లిదండ్రులు చూపే పక్షపాతము, (అనగా) ఒకరిఎడ వకమాదిరిగా చూపే, ప్రేమనుగురించి వచ్చేసంచికలో పంపుకుంటాను.

కె. సత్యవతమ్మ

# — సహగమనము —

శ్రీ యం. రామజోగారావు గారు

(గత సంచిక శేషము)

నూరు సంవత్సరముల బ్రిటిషు పరిపాలనములో నొక సహగమనపు కేసు కూడ గవర్నమెంటువారు విని యుండలేదు. జిల్లాపోలీసు అధికారి యీవిషయమును ఇన్‌స్పెక్టరుజనరలు పోలీసున కెఱింగించి యీ విషయమున నెట్టిచర్య జరుపవలసి యుండునో యనుజ్ఞ వేడెను. డైరెక్టరు జనరలు ఆంగ్లదేశస్థుడు. ఆతనికి రుక్మిణీదేవి వాఙ్మూల మత్యంతాశ్చర్యము గొల్పినది. తోడనే యాతడు జిల్లాపోలీసు రెవిన్యూ అధికారులతో కూడ కృష్ణపురము ప్రవేశించి కేసు విచారణ ప్రారంభించెను. గ్రామోద్యోగస్థులు రుక్మిణీదేవి సహగమనము చేయనున్న సంగతి మొదట తమకు తెలియదనియు, తెలిసినతరువాత యామెకు ప్రభుత్వ చట్టము ప్రకారము సహగమనము కూడదని బోధించితిమి కాని యామె వినలేదనియు, గాన యామె వాఙ్మూలమును మాత్రమే గొని యేలినవారికి తెలియ పఱచితిమనియు తమవలన దోషమావంతయు లేదనియు వాఙ్మూలమిచ్చిరి.

అనంతరము రుక్మిణీదేవి మామగారి వాఙ్మూలము గైకొనబడెను. అతడు తన కుమారునియొక్కయు, కోడలియొక్కయు పరస్పరప్రేమను, దాంపత్యజీవితమును వెల్లడించి తానెంతజెప్పినను కోడలు వినలేదనియు ఒకవేళ తాను రుక్మిణి సహగమనమున కంగీకరింపక పోయినను, బలవంతముగ నామె యే నూతినో గోతినో పడియైనను మరణించు ననెడి నమ్మకముచే, చేయునది లేక, దృఢసంకల్పముగల తనకోడలి కోర్కె చెల్లించితి ననియు నట్టికోడలిని బడసినందున తమకుటుంబము కీర్తి కెక్కినదనియు వాఙ్మూల మిచ్చెను.

బలరామశాస్త్రి కృష్ణశాస్త్రి సోదరుడు. కృష్ణశాస్త్రి కంటె రెండు మూడు సంవత్సరములు పెద్దవాడేయైనను, తమ్మునికి గల యోరిమియు, నెమ్మదియు బలరామశాస్త్రి వద్ద లేవు. అన్నదమ్ములిద్దరు నొకేవిధమైన యాదర్శములు గలవారు. కాని ద్వాపరయుగములోని బలరామ శ్రీకృష్ణులవలె, బలరామశాస్త్రి తనయభిప్రాయములను పైకి వెల్లడి చేయు స్వభావము గలవాడు. కోపశీలుడు. కృష్ణశాస్త్రి ఓరిమిగలవాడు. తనయాదర్శములను మాట్లాడకుండా కార్యరూపముగ జేసి చూపువాడు. బలరామశాస్త్రి రవీంద్రుని గోరావలె తనకు సరియని తోచిన దాని నాచరించువాడు. సహగమనముపై నాతనికి నమ్మకము మెండు. నిజమైన ప్రణయముగల దంపతుల ప్రేమకు విఘ్నము గలిగినప్పు డిది స్వభావ సిద్ధమైన పరిణామ మని యాతని దృఢమైన విశ్వాసము. రుక్మిణీదేవి పతిభక్తి లోని సత్యము నాతడు గ్రహించెను. ఆకారణముననే యాతడామెను వరుసకే కాక నిక్కముగ సోదరి వలె ప్రేమించుచుండెను. ఆమె యనిన యాతని కాదరము మెండు. ఆతని తలిదండ్రులు మమతచే రుక్మిణీదేవి సహగమనము చేయునపుడు విలపించిరి. కాని, బలరామశాస్త్రి కంట తడియైనను పెట్టలేదు. ఆతడామె భాగ్యమును కొనియాడి తన తమ్మునితో స్వర్గసౌఖ్యముల ననుభవింపుమని దీవించెను.

బలరామశాస్త్రి యగ్రజుండగుటచే రుక్మిణి సహగమనము నాపుటాతని ధర్మము కాని యాతడట్లేల గావింప ప్రయత్నము చేయలేదో యని యాతని వాఙ్మూలము కూడ నడుగబడెను. బలరామశాస్త్రి తన వాఙ్మూలమున ప్రపంచముననున్న యన్నివిధముల ప్రేమకంటె ఆదర్శదంపతులప్రేమ యత్యుత్తమము, పవిత్రము నైనదని అన్నిదేశములవారు కూడ నొప్పుకొందురు. గ్రీకుదేశస్థులు దీనిపై ననేక యుద్గ్రంథములను రచించిరి. ఇటలీ దేశస్థుడైన డాంటీ (Dante) మున్నగు కవులు ప్రేమగానము చేసియే ప్రసిద్ధిగాంచిరి. షేక్‌స్పియర్ (Shakespeare) తన సానెట్స్‌లో (Sonnets) లోను, స్పెన్సర్ (Spencer) మొదలు (Tennyson)వఱకుగల కవులందఱును ప్రణయ మత్యుత్తమ మైనదని ప్రశంసించిరి. ఇక భారతదేశస్థులీపవిత్ర ప్రేమను వివాహ బంధ మేర్పడిన కాలమునుండియు నొప్పుకొని యుండిరి. రురుడు, ప్రమద్వతి మరణింప, తన జీవితకాలములో

సగమామె కాలకు ధారవోసి యామెను బ్రతికించుకొనెను. మ్లేచ్ఛ జాతులు భారత దేశమున నడుగు పెట్టనంతవఱకు సతులు తమ భర్తలను నిజముగ ప్రేమించి, వారు మరణించిన తరువాత, వారితో సంతోష పూర్వకముగ సహగమనము గావించుచుండిరి. ఆంగ్లసాహిత్యమున వెల్లడి చేయబడిన ప్రేమ కూడ పవిత్రమైనది స్త్రీపురుషు లొకరి నొకరు సత్యముగ ప్రేమించు కొనునపుడు వారిలో నే యొకరు మరణించినను రెండవవారు జీవింపజాలరు. పాశ్చాత్యు లీప్రణయము యొక్క ప్రథమ దశను మాత్రమే వర్ణించిరి గాని, దాని పరిణామమును గుర్తింప లేకపోయిరి. సనాతన హిందూదేశ మట్టిప్రేమ నమలులో పెట్టి దాని పర్యవసాన ఫలములను గూడ ననుభవించినది. ఆంగ్లేయుల పవిత్ర ప్రేమ గ్రంథములలో తప్ప నాచరణలో లేదు. ఆచరించినచో వారష్టమయెడ్వర్డును రాజ్యభ్రష్టుని గావించియుండరు. ఆతడు గావించిన యపరాధము తాను వలచినట్టియు, తన్ను ప్రేమించినట్టియు, స్త్రీని వివాహమాడుటయట! అధికారము చేత లేక పేరునకు మాత్రము సామ్రాట్టైన యెడ్వర్డు తనయిచ్చ వచ్చిన స్త్రీని వివాహమాడలేక పోవుట ఆతని దోషముకాదు. ప్రేమయొక్క తత్వమును గుర్తెఱిగి, ప్రపంచమునకు దానిని చాటి, నాగరిక ప్రపంచములో నత్యుత్తమమైన జాతులని విఱ్ఱవీగెడి పాశ్చాత్యుల దోషము. ఇదేమని యడిగినచో వారు రాజ్యాంగ తంత్రమని ప్రత్యుత్తర మిత్తురు. చెప్పునదొకటి చేయునదొకటి. ఏకపత్నీవ్రతమన్న నేమియో తెలియక చూచిన స్త్రీని కామోపశమనమునకు పెండ్లాడెడి వారు భారతజాతియొక్క ప్రేమతత్వము నెఱుంగ గలరా? ఈ సంస్కర్తలు క్షీణించిన యాచారమును మొదలంట నఱికిరిగాని, ఆయాచారముయొక్క పవిత్రతను గుర్తింప లేకపోయిరి. ప్రేమతత్వము నెఱింగి దాని పరిణామము మనఃపూర్వకముగ ననుభవింప సిద్ధముగ నున్నవారి కేల ప్రభుత్వమునుండి శిక్ష? రుక్మిణీదేవి బలవంతముగ సహగమనము చేయ ప్రోద్బలము చేయబడియుండలేదు. ఆమె తన పవిత్ర ప్రేమకు పర్యవసానముగ సహగమన మొనర్చినది. దీనికి గ్రామోద్యోగులు గాని, కృష్ణశాస్త్రి బంధువులుగాని యెట్టి బాధ్యతా దోషయుక్తులును గారు. ప్రభుత్వమునకు వీరిని శిక్షింప నెట్టి యధికారమును లేదు".

ఇన్స్పెక్టరు జనరలుగారికీవాఙ్మూలము గుండుదెబ్బవలె తగిలెను. తనజాతిలోని లోపములను వెల్లడించినప్పుడాతనికి కోపమువచ్చినది. చేతనధికారము గలవాడగుటచే శాంతము నటించి "ఇదియంతయును సత్యమేగాని, న్యాయశాస్త్రమునకు నేను బద్ధుడను. సహగమనము నాపక పోయినందులకై గ్రామోద్యోగుల కారుమాసములు విడిఖైదు నూరు రూపాయలు తలనొక్కంటికి జుల్మానా" యని తీర్పుచెప్పెను. ఏకజాతి వాడగు కలెక్టరు తన యామోదమును సూచించుచు కాగితముపై చేవ్రాలు చేసెను. "బలరామశాస్త్రి వాఙ్మూలము రాజద్రోహ పూరితముగ గన్పట్టుచున్నది. యీతనిని వేఱె విచారణచేయవలసి యుండును; గనుక ప్రస్తుత మాతనిని పోలీసువారు తమవశమున నుంచుకొనెదరు" అని కలెక్టరు పలికి జవానులకు సంజ్ఞాపూర్వక[illegible] నాజ్ఞయిచ్చెను. "ధర్మము కొఱకెట్టి శిక్షనైన మేముకూడ యనుభవింతుమని" యుక్కుపెట్టున జనఘోషణ బయలుదేరెను. ఈ గ్రామస్థులుకూడ రాజద్రోహులుగనే కన్పట్టుచున్నారు. తరువాత వీరిసంగతి పూర్తిగ తెలిసికొందము. ప్రస్తుతము వీరిని లాటీదెబ్బల మూలముగ చెల్లాచెదరు గావింపుడని రక్షకభటులాజ్ఞాపింపబడిరి. రక్షకభటులు తమ యధికారులయాజ్ఞ ప్రకారము లాటీల నెత్తిరి. ఇంతలో బలరామశాస్త్రి "ప్రభుత్వచట్టములకు మనము బద్ధులము. ప్రస్తుతము మీరేమియు చేయనక్కరలేదు. ఎక్కడివారక్కడకు పొండు" అని బిగ్గరగ హితోపదేశము గావించెను. దానితో జనము చెల్లాచెదరై పోయెను. బలరామశాస్త్రి గ్రామోద్యోగస్థులుగూడ కృష్ణపురమును వీడిరి. బలరామశాస్త్రికి దేశద్రోహియను నేరముపై సంవత్సరము ఖైదు వేయబడెను.

శిశువివాహనిరోధక శాసనాధిష్ఠాత

# హర్ బిలాస్ సర్దా గారు



శ్రీయుత వంగోలు వెంకటరంగయ్యపంతులుగారు బి.ఏ.,బి.యల్. (గతసంచిక శేషము)

1924లో అజమేరు-మెర్వారా పరగణా కొక ప్రాతినిధ్యము ఇండియన్ లెజిస్లేటివ్ అసెంబ్లిలో నమర్పబడగ ఆస్థానమునకు వీరు ప్రథమ ప్రతినిధులుగ నెన్నుకొనబడిరి. ఆస్థానమునకు వీరు తిరుగ 1926లో నను నెన్నుకొనబడిరి. వీరు లెజిస్లేటివ్ అసెంబ్లి సభ్యులుగ నుండగ 1925 లో లోకోత్తరమగు శిశు వివాహనిరోధకశాసనమును అసెంబ్లిలో ప్రవేశపెట్టిరి. అది 1929లో అంగీకారమై 1930సం॥ ఏప్రెలు నెల 1 ది నుండి అమలులోనికివచ్చినది. దీనినే పామరులు శారదాబిల్లు అను వాడుకగ జెప్పుకొనుచుందురు.

వీరికి సంఘసంస్కార ప్రవీణత పసితనముననె యంకురించినది. బాల్యమున వీరి తండ్రిగారితోగూడ సాధుసన్న్యాస సమావేశములకు శ్రద్ధతో పోవుచుండిరి. ప్రథమదశలో వీరు సనాతనమతేహిందువులై తన్మతావలంబకులుగ నుండిరి. వీ రెనిమిదేండ్లవారుగ నుండగ శ్రీ స్వామిదయానంద సరస్వతిగారు అజమేరునకువిజయముచేసి అచట కొన్నియుపన్యాసముల జేసిరి. తండ్రిగారితోగూడ బాలురగు నీసర్దాగారును పోయి ఆయుపన్యాస శ్రవణముజేసిన నాటినుండియు ఒకరీతియగు విచారదశ వీరి మందును అంకురించినది.

చిన్నతనముననుండియు వీరికి నానావిషయముల దెలుపు గ్రంథముల జదువుటయందును వార్తా పత్రికల జదువుటయందును అత్యంతమగు ప్రీతి కలిగియుండినది. సహాధ్యాయులగు రామగోపాల్ మున్నగువారిని ప్రోత్సహించి అజమేరులో నొకడిబేటింగు సొసైటిని (వాద ప్రతివాదముల నొనరించు సభ) సాగించి నానా విషయములనందు జర్చించుచుండిరి. ప్రథమ దశలో వీరు కాంగ్రెసు భక్తులు. 1888 లో ప్రయాగ (అలహాబాద్) పట్టణమున జరిగిన ఇండియన్ నేషనల్ కాంగ్రెసును కడు శ్రద్ధాభక్త్యుత్సాహములతో అభిమానించి సేవించిరి. కాంగ్రెసు నాయకులలో నొకరును ప్రవర్తకులును అయిన పండిట్ అజోధ్యానాథుగారిని కాంగ్రెసు స్థాపక త్రిమూర్తుల నొకరును బ్రిటిషు వారి ప్రభుత్వపదవులలో గొప్ప స్థానము నలంకరించి పింఛను పొందిన ఏ.ఓ.హ్యూంగారిని దర్శించి, వారు చేయుచుండిన దేశసేవా విధానములయెడ నత్యంత గౌరవ ప్రమోదముల బొందిరి. అటు తరువాత నాగపూరు, బొంబాయి, కాశీ, కలకత్తా, లాహోర్ లోనగు గొప్ప పట్టణములందు మహావిభవముతో జరిగిన దేశీయ మహా సభలకు (ఇండియన్ నేషనల్ కాంగ్రెసు) బోవుచుండిరి.

చిన్ననాటినుండియు దూరదేశ ప్రయాణములపై వీరికి అధిక ప్రీతియు బులుపును కలిగియుండినవి. ఇంగ్లాండు యువరాజుగారగు యడ్వర్డు మహాప్రభువుగారు ఇండియా దర్శింపవచ్చి, 1876లో రాజపుత్రస్థానమున ముఖ్యపట్టణమును కడురమ్యమును అగు జయపురమునకు విజయంజేసిరి. ఆ సందర్భమున నచట గొప్ప గొప్ప వేడుకలు ఉత్సవములు జరిగినవి. మన సర్దాగారి తండ్రిగారు ఆ వేడుకలజూడ జయపురమునకు బోయిరి. సర్దాగారును తండ్రిగారితో గూడ బోయి అచటి వేడుకల కన్నులారజూచి కడు పార ననుభవించిరి. ఈ యువరాజుగారే తమ తల్లి కీర్తిమూర్తి శ్రీ విక్టోరియా మహారాణిగారి యనంతరము సప్తమెడ్వర్డు అనుపట్ట బిరుద నామధేయముతో పదునొకండేండ్లు ఇండియాను మహాప్రీతితో పరిపాలించిరి. శాంతమూర్తి యనుబిరుదమును బొందిరి.

సర్దాగారు రాజపుత్రస్థానమున ననేక స్వతంత్ర రాష్ట్రములను తదధిపతులను జూచిరి. జోధ్‌పూర్, ఆల్వార్, బికానీర్, కిషన్‌ఘర్, దున్‌గార్‌పూర్, శిరోహి, ఉదయపూర్, జైసాల్మెర్, కోటా,బుండి, ఝాలరపట్నం లోనగు నెన్నియో స్థలములకు విజయముజేసిరి. తలిదండ్రులతోకూడ హిమాలయముల లోని బదరినారాయణము, తూర్పున జగన్నాథము, దక్షిణమున రామేశ్వరయాత్రయు బూర్తిజేసి - పంజాబు రాష్ట్రమును అందలి ముఖ్యపట్టణములగు లాహోర్ అమృతసరస్సులోనగు వానిని దర్శించిరి. తరువాత ఢిల్లి, హరిద్వారము, మధురా

(బృందావనము) అల్లిఘర్, లక్నో, సింలా, కలకత్తా, పాట్నా, గయా, కాన్పూర్ లోనగు పట్టములనుగూడ జూచిరి. బెంగాలు రాష్ట్రములోని బారెల్లి అను పట్టణమున 1924 సంవత్సరమున జరిగిన అఖిల భారత వైశ్యమహాజనసభ కగ్రాసనాధిపతిగ బోయిరి. మహారాష్ట్ర దేశమున బొంబాయి, పూనా, గ్వాలియర్, ఇండోర్, బరోడా పట్టణములను గుజరాతు ప్రాంతములలో, అహమదాబాద్ లోనగు పట్టణములను దర్శించిరి. మహాత్మాగాంధిగారు యెఱ్ఱవాడ జెయిలులో నుండగ ఆ పుణ్యక్షేత్రమునకుపోయి శ్రీ మహాత్ముల దర్శనము బొందినారు. మరియు నైజాము యిలాకా హైదరాబాదు, మైసూరు యిలాకా బెంగుళూరు, మద్రాసు, మధుర, శ్రీరంగము, కంచి, ఉదకమండలము లోనగు స్థలములను పశ్చిమోత్తర ప్రాంతముల పెషావర్ ఖైబరుకనుమ, ఢెరాధూన్, తక్షశిల మొదలగు ప్రదేశములనుకూడ జూచిరి. భరతఖండమునంతయు ఆ పాద మస్తకముగ వ్యాపించి సేవించిన మహానుభావులలో వీరు నొకరుగనున్నారు.

"యస్తుపర్యటతే దేశాన్
యస్తు సేవేతపండితాన్
తస్య విస్తారితా బుద్ధి
స్తైల బిందు రివాంభసి"

యను మనుప్రమాణము వీరియందు సార్థకమైసిద్ధమయినది. ఇంత విస్తార యాత్రలవలననే వీరికి నానాదేశస్థితులు చక్క_గ బోధపడి అందందుగల అసదాచారములును వీరికి బాగుగ గోచరమై శిశువివాహనిరోధక శాసనాది లోకోపకార ప్రచారముల వీరి మనస్సులగ్నమగునటుల ప్రవర్తింప జేసినవి. ఈయన కార్యశూరుడు. న్యాయము నిజము అయినదాని నను్ష్ఠింప ప్రయత్నించువాడు.

శ్రీ దయానంద సరస్వతీస్వామివారు ఘూర్జర బ్రాహ్మణులు. వీరి జననము 1825 గ నున్నది. పూర్వవయసుననె సకలవేదశాస్త్రముల నధ్యయనము జేసి వేదములకు స్వతంత్రముగ భాష్యరచనలు చేయగలిగినాడు. వర్ణాశ్రమాచారముల నావరించియుండు దురాచారముల సహింపజాలక వీరొక మార్గమును సాపించి ఇదియె యథార్థమయిన వైదికమార్గమని సాధించిరి. దీనికే ఆర్యసమాజమను పేరు. ఉదాహరణము: ఒకయింట నలుగురన్నదమ్ములున్నయెడల వారిలోనొకడు వైదికమార్గానుసారముగ జీవనముచేయ నిచ్ఛగింపవచ్చును; ఆ కుటుంబమున కతడు బ్రాహ్మణుడు. రెండవవాడు రాజకీయోద్యోగ ధర్మముల ననుష్ఠింపవచ్చును అందుచే నతడు క్షత్రియుడనబడును. మరియొకడు కృషివాణిజ్యాదుల నాశ్రయించి వైశ్యవృత్తిలో వైశ్యుడగుచున్నాడు. ఇట్లు వాని వాని వృత్తిచేత బ్రాహ్మణాది భేద మేర్పడుచున్నదేగాని జన్మవలన యేమియులేదు అని సిద్ధాంతము జేసెను. ఈసిద్ధాన్త మీ స్వామివారు ప్రవేశబెట్టినదిగాదు. అనాదిగ కొన్ని రాజనీతి శాస్త్రములలో ప్రచురమయి నదిగాను యగపడుచున్నది. ఏ ప్రాచీన కాలముననో ప్రవర్తింపబడిన శుక్రనీతి సారము అను రాజనీతి గ్రంథమున బ్రాహ్మణాది భేదములగూర్చి నిర్వచింపుచూ శుక్రాచార్యు డిట్లు చెప్పియున్నాడు:—

నజాత్యా బ్రాహ్మణ శ్చాత్ర
క్షత్రయో వైశ్య ఏవచ
నశూద్రో నచవై మ్లేచ్ఛో—
భేదితా గుణకర్మభిః ॥
బ్రహ్మణస్తు సముత్పన్నా—
స్సర్వే తేకిన్ను బ్రాహ్మణాః ॥

'ఇత్యాది శుక్రనీతిసారము-ప్రథమాధ్యాయము: శ్లో.38

విశ్వామిత్రశ్చ వసిష్ఠో
మాతంగో నారదాదయః ॥
తపో విశేషై స్సంప్రాప్తా
ఉత్తమత్వం నజాతితః ॥

నాల్గవ అధ్యాయము నాల్గవ ప్రకరణము. శ్లో 40. భేదము వృత్తిగతమెగాని జన్మవలన కాదని తెలియుచున్నది. శ్రీ దయానందుల వారి బోధనల నంగీకరించిన వారు ఈ విధమున ఒక కుటుంబముననే ఒక తల్లి సంతానముననే బ్రాహ్మణాది వ్యవహారము వృత్తిభేదముల నవలంబించుచున్నారు.

(సశేషము)

# "అన్వేషణ"

కోరిక దీరగా గడుసు కోయిల లీమధుమాస శోభలో
గేరుచు గొంతులెత్తి పలికించు మనోహర రాగమాలికా
హార సుధార్ద్రి వీచికల కయ్యెయో నన్బలిగా నొనర్చి ఏ
దారిని బోతివోయి సుఖదంబగు కాలము విస్మరించుచున్.

మెఱపుల రాత్రులన్ మృదుసమీరము నీకథలెల్ల జెప్ప నే
పరిమితి లేని కోరికల భారములోన జమర్చి నిన్ గనన్
మొఱగెడి కన్నుదోయికిని ముద్దులు పెట్టుట నేర్పుకొంచు నీ
విరహము సైచుచుంటి, గనుపించి మరల్పగదే వ్యథన్ సఖా!

వనముల మాలతీ మధుర వాసనలన్ చెలరేగు తేంట్లయ
వ్వన సుమశయ్యలన్ దనిసి వాడిన వాయుకుమారు కౌగిటన్
దనువులు పుల్కరించగ సుధాంశుడు విప్పిన చల్వపందిరన్
గనుగొన వచ్చినా నచట గానగరా వెటకేగి యుంటివో!

నీ వరుదెంతువంచు నిశి నిద్దుర కన్నుల మేలుగొల్ప ప్రే
మావిలమైన కట్టుకథ లల్లుక నే వినిపించుచుందు నిం
కీ విలు జేరకున్న యెడ నీమధుమాసపు పండువెన్నెలన్
శ్రావణ కృష్ణపక్ష తిమిరంబయి పోవు ననంత దుర్విధిన్.

ఏ తరుణీమణీ విరహమేని నినుంగని కాటువేయగా
పాతర లాడుచుంటి వొకో! ప్రాణసఖా, నను గేలిజేసి వి
యాతనలందు డించిన భయంపడగాని వియోగ మాధురీ
రీతులనేని నన్ను మధురింపుమురా పులకింతు నిల్వనన్.

ఈవిరహార్తి క్రుంగి దపియించి కరంగిన నాయెడంద రా
గావిలమైన కోరికల నానుచునే స్రవియించి పోయెనే
దో విపరీత మార్గముల దుశ్శకునంపు ముహూర్తమందు ఓ
దేవ! ఇకేటి యాసలు గతించె మనోభవ వాసనాతతుల్.

మూతలు వడ్డ నాకనల్పమూగతపంబు ఫలింపజేసి నా
చేతము చల్లజేయ దయసేయుము వేడెద నొక్కమారు నీ
కైతపియించి గుండెలను గట్టిగ పిండి రచించుకున్న నా
గీతిక లాలకించి పులకింపుము నాతుదికోర్కెగా ప్రభూ!

ఇట నక్షత్రము లెన్నియో విరిసె; కానీ కానరావో యి నీ
నటనా కౌశల వైభవంబు తెలియున్ నావార్త నీవీను లం
దెటులో వైచెడి వార లొక్కరును లేనీ లేని యిక్కాలమం
దిట నాసాధ పయోధ మాలిక నిరీక్షింతున్ మనోవీధులన్.

"పద్మమధు"

# ఆదివారపు అవకాశం!

శ్రీమతి డి. యస్. రాజేశ్వరీపట్నాయక్ గారు

నెలనెలా వచ్చి పలకరిస్తోంది, గృహిణీజ్యోతి 'గృహలక్ష్మి' ఆటమటించే స్త్రీల హృదయాలకు ఆనందం కలిగిస్తూ...యేదన్నా వ్యాసం వ్రాద్దామనుకున్నా. ఆదివారాలకు వారాలు, నెలలై పోయాయి. ఈ మధ్య ఆదివారపుకథలు స్త్రీ నిందలతో రకరకాలుగా పత్రికలపుటలు నిండుతున్నాయి. గృహిణి అవకాశాలు గృహస్థుడు గమనించుటలేదు. పైగా నిందారోపణ! ఆ కథలు చదువుతోంటే నవ్వుకూడా వస్తోంది. "అదృష్టమైన ఆదివారం అనుభవించలేదే" అని పరితాపపడే స్వార్థజీవులు. యుద్ధధర్మమో, స్త్రీల దురదృష్టమో? అంట్లు తోము పని మొదలు చాకిరేవువరకూ భరిస్తున్న గృహిణి జీవితభారాన్ని మట్టుపెట్టి ఆదివారపు అవకాశాన్ని స్త్రీ నెత్తిపై రుద్దడం శోచనీయం! యుద్ధం రాకపూర్వం గృహిణికి గృహకృత్యాల్లో దాసీల సహాయముండేది. యుద్ధధర్మమా అని ఆర్థిక దుస్థితితో ప్రపంచమే తలక్రిందులైనది. వర్గచైతన్యం కలిగింది; దాసీమనిషి మొదలు చాకలివరకు సమ్మెకట్టి పనులకు రావడం మానేశారు. మధ్యతరగతి సంసారాల్లో స్త్రీల కష్టాలు శాఖోప శాఖలుగా విజృంభించాయి: లాలనపాలన మరిగిన పిల్లల అల్లరితో, 'ఆఫీసు వేళైందనే" పతిదేవుని గర్జనలతో, అలసటను బయల్పడనీక అనారోగ్యాన్నికప్పిపుచ్చుకొని సతమతపడుచు ఆదివారానికై యెదురుచూచే గృహిణికి ఆదివారపు అవస్థ మరీదుర్భరమై పోవుచున్నదంటే నమ్ముతారా? ... చంటిబిడ్డతల్లి "రేపాదివారమేగా; కాస్త అలస్యంగాలేచినా ఫరవాలేద"ని శనివారం రాత్రి శయ్యచేరుతుంది; గాని తెల్లారితే!... పరిస్థితి? అనుకోని అదనపు పనులు యెన్నో! శనివారం రాత్రి "చూడు నీ...రేపాదివారమేగా; కాస్త అలస్యంగాలేస్తా; కాఫీతో కమ్మటి ఫలహారం తయారు చేయాలి" అని పతిదేవుని మొదటికోరిక!—"హోమ్ వర్కంతా పూర్తి చేసుకున్నానే; రేపు హాయిగా ఆడుకుందామని వేగం లేపకమ్మా, రేపాదివారమేగా" బిడ్డల కోరిక. ప్రతిరోజూ కంఠస్నానాలు చేసినా, శలవురోజు గనుక (ఆదివారం) బిడ్డల శిరస్నానాలు ఆ రోజే.-యింట్లో పట్లూ, బూజులూ దులిపి నలువైపుల చెదరియున్న సామానులన్నీ సర్దుకోవడం ఆ రోజే - ఈ సందట్లో ఆదివారపు అనుభవాన్ని అనుభవిస్తున్న భర్తగారికి యేకాంతలోపం వచ్చినా యుగయుగాలనుంచీ పాతుకుని వున్న అధికారభావం గబుక్కున ఆయనలో మూర్తిభవించి అంగబలంనుండి ఆర్థికసంపత్తుల చివర అత్తవారిలోపాలవరకూ కూకటివేళ్లతోసహా, కుళ్లగింపబడిన సరిక్రొత్త వాదాలు, వింత వింత కథలతో గృహమంతా ప్రతిధ్వనించి పోతుంది. చెవులు రిక్కించి తలిదండ్రుల వాగ్ధాటిని చక్కగా వింటారు బిడ్డలు. గడియారం గంటలు నడిచిపోతూనే ఉంటాయి; గృహిణికి పనులు చిగుర్చుచూనే వుంటాయి. పైగా ఆదివారపు మిత్రుల (భర్తగారి) మర్యాదకై విందులు; (రేషన్ రోజులైనా తన పొట్ట మాడ్చుకొనైనా) అతని మిత్రులకు మర్యాదచేసి సంతోషింపజేయాలి! ఇంత త్యాగంచేసినా సంఘంలో స్త్రీ త్యాగమయ జీవితాన్ని యెంత చక్కగా ప్రతిబింబింప జేస్తున్నాయి కలాలు! భాగ్యవంతుల గృహాల్లో స్త్రీలు భోగభాగ్యాలనుభవించినా మధ్యతరగతి సంసారాల్లో బహుసంఖ్యాకులు విశ్రాంతికై మొహం వాచియున్నారనుట అసత్యంగాదు. (ఆదివారంనాడు) కుటుంబంలో భార్యాభర్తలు చీదరించుకుంటూంటే సుఖజీవనం పొందడ మెలా? పురుషుడు కర్రపెత్తనం చేస్తూవుంటే స్త్రీ జంతువువలె తలవాల్చి అనుసరిస్తోంది, యెందుకు? విద్యావిహీన, నిర్ధనురాలు, అస్వతంత్రురాలు. గాని నేటి స్త్రీ ఏ చిన్న అవకాశాన్నైనా జారవిడువదు. పారతంత్ర్యాన్ని గుర్తించి విద్యోపార్జనచేసి స్వాతంత్ర్య దీపికనుచేదాల్చి దేశంలో, సంఘంలో, కుటుంబంలో తన స్థానాన్ని గమనించింది. గతజీవనానికి నేటి జీవితానికి సింహావలోకనంచేసి చివరకు రెండింటిని ఊహిస్తే పురుషుడు కొన్నాళ్లు నియంతృత్వమనే అధికారం తెల్లవారవలె అక్రమించి అధికారం చెలామణీ చేసేవాడు. స్వరాజ్యానికై భారతీయులు పడినపాట్లువలె సహనశక్తితో త్యాగమయ జీవితాన్ని నెరపి పురుష స్వార్థాశయాలను గుర్తింపజేసి స్వాతంత్ర్యగాములై కుటుంబ రక్షణ మొదలు దేశరక్షణవరకు సాధింపగలరనుట నేటి స్త్రీల చరిత్రయే తార్కాణము. • స్త్రీలపై నిందారోపణలు మాని, భార్యాభర్త లిరువురు ఆదివారపు విలువ గ్రహించి ఆచరణలో పెట్టాలని నా కోరిక.

# గృహలక్ష్మి స్వర్ణకంకణ ప్రదానోత్సవ వృత్తాంతం

**గృహలక్ష్మి**

(146 వ పుట తరువాయి)

శ్రీ నాగరత్నంగారిని నాకు చిరకాలమునుంచి తెలియును. వెనుక పార్కుఫేర్ వేడుకలను డిసంబరు వేడుకలు అనేవారు. నా చిన్నతనమునుండిన్నీ ప్రతిసం॥ము నేనా వేడుకలకు వెళ్లి చూస్తూండేవాడను. ఒకసారి ఆ వేడుకలుజరిగే ప్రదేశమున పెద్దగేటువద్ద ప్రజలు ఏదో చూచుటకై గలభాగా పరుగెత్తిపోవుచుండిరి. నేను అక్కడ ఉండడంచేత 'ఏమిటావీరుచూచేవింత' అని ఆజనమువద్దకువెళ్లి అడిగితిని. వారు 'బెంగుళూరు నాగరత్నం' వస్తూన్నది - అన్నారు. ఇంతఆత్రముగా ప్రజలు ఎగబడిచూచేవ్యక్తిని చూతామని నేనున్నూ మోచేతిపోట్లుతినుచు ముందుకుత్రోసుకొనిపోయినాను. ఆ జనమధ్యమున నేనుచూచిన దృశ్యము ఇప్పటికి నాకు కళ్లకుకట్టినట్టున్నది. ముందుగానొకదాసి వెండిచెంబుతో కాఫీపట్టుకొని నడుచుచుండెను. ఆమెప్రక్కన మరొకదాసీ మరొకవెండిచెంబుతో వేడినీళ్లుపట్టుకొని నడుచుచుండెను. ఒక వెండి తాంబూలపుపెట్టె చేతపట్టుకొని యజమానురాలు కనుసన్నల నాజ్ఞాపింపగనే ఆకుమడుపులందిచ్చుటకు సిద్ధముగా మెలకువతో నొకతె నడుచుచున్నది. వేరొకవంక మరొకతె అందమైన విసనకర్రచేతబట్టుకొని యజమానురాలికి వింజామరలు వేయుచుండెను. వీరందరు చక్కగా అలంకరించుకొనియున్నారు. ఇట్టి పరివారముతో, అందందు తొలగుచు ఎగబడి చూచుప్రజలమధ్య - ఆ దీపములకాంతిలో ధగద్ధగమెరయుచున్న వజ్రాలనగలతో వళ్లంతయు సింగరించుకొని జెలగల చీరగట్టి - దేవతావనితవలె వయ్యారముగ నడచివచ్చుచున్న ఈమెనుచూచితిని. అదీ నాటి నాగరత్నంగారిఠీవి. అదియే నాగరత్నంగారితో నాకుగల ప్రథమ పరిచయము. అనగా - ఆమెను నేనుచూచితిని; కాని నన్నామె చూడలేదు. నావంటివారెందరో కలిసి ఆమెనొక్కతెను చూచిరి గాని ఆమె ఒక్కతె ఎందరిని చూడగలదు ?

అప్పుడెవరీమెయనగా సంగీత సాహిత్యములందు గొప్ప విద్వాంసురాలనిరి. అప్పటినుండి ఆమెపాట కచ్చేరీలకు హాజరగుతువచ్చితిని.

ఆమె పాట చాలఘనమైనదని నేను చెప్పనక్కరలేదు. అయితే అంతకన్న విశేషమేమనగా ఆమె కచ్చేరీలయందు, ధనముపుచ్చుకొని కచ్చేరీలు గావించినను-చాల స్వతంత్రమును, గాంభీర్యమును ప్రదర్శించును. తనను సభలో 'అదిపాడు మిదిపాడుము' అని ఎవ్వరైన ప్రశ్నించినచో - అధికారినిగ్గుర్తెరిగి సరసముగ సమాధానము చెప్పుచుండెడిది. ఒకసారి పాటకచ్చేరి జరుగుచుండెను. ఆమె 'భజనసేయవే - మనసా' అన్న కీర్తన కళ్యాణిలో భక్తిపారవశ్యమున మనోహరముగ పాడుచుండెను. అందరు తన్మయులై నిశ్శబ్దముగ వినుచుండిరి. అప్పుడొకశెట్టిగారు హడావుడిగా సభలోప్రవేశించి-ముందుకూర్చుండి ఆమె పాటముగింపగానే-"ఒక్కసారి కాఫీరాగముపాడండి" అని ఆమెనడిగెను. అందుకామె "అయ్యో సెట్టిగారూ! ఇంతవరకు పాడినది కాఫీయే! ఈరోజునకు కాఫీఅయిపోయినది. ఇక రేపు ప్రొద్దుననే తిరిగీకాఫీ-మన ఇంట ఆరగింతురుగాని." అని అనగానే అందరును గొల్లుననవ్విరి.

సంగీత సాహిత్యములయందు ఈమెకు అసమానపాండిత్యము. ఈమె సాహిత్యసంపద చెప్పవలెనంటే తార్కాణము: శ్రీ కందుకూరి వీరేశలింగంపంతులుగారిని తెలియనివారులేరుగదా, ఆయన ఆ రోజులలో ఎదురులేకుండా అన్నిరంగములలో వ్యవహరించినవ్యక్తి. ఆయన కవులచరిత్రవ్రాసినాడు. అందులో రాధికాసాంత్వనము అనే శృంగారకావ్యమును రచించిన ముద్దుపళని - అనే భోగముపడుచు చరిత్ర వ్రాయుచు ఆయన కొంత నిరసనముగా వ్రాసినాడు. దానికి నీమెకు కోపమువచ్చినది. అప్పటికాపుస్తకము సరియైన రూపమున ప్రచారములో లేదు. ఈమె ఆ గ్రంథముయొక్క వ్రాతప్రతులనన్నిటిని సంపాదించి - శుద్ధప్రతినివ్రాసి ప్రచురింపచేసినది. అందొకపీఠికవ్రాసి శ్రీ వీరేశలింగంగారి తప్పులెత్తిచూపి, ఆయన ముద్దుపళనినిగూర్చి విరసనముగావ్రాయుటను ఖండించినది. ఆరోజులలో శ్రీ పంతులుగారినెదుర్కొనుట

మిక్కిలిసాహసము. సాహిత్యమునందు తనకుగల సుస్థిరమగు పాండిత్యముచే నీమె ఆ సాహసమొనర్ప గలిగినది.

సంగీతశాస్త్రమునందున్నూ ఈమె గొప్పవిద్వాంసురాలు. చక్కని శారీరము. ఇంకను ఆమెశారీరము శ్రావ్యముగ నేయున్నది; ఏమాత్రమును జంకలేదు. అందుచే నాటికి నేటికి సంగీతవిద్వాంసులకామెయన్న ప్రక్కబెదురే.

ఆమె పుష్కలముగా ధనముసంపాదించినది; చక్కగా అనుభవించినది. నాగరత్నం ఆరోజులలో భోగరత్నమైనది. పిదప త్యాగరత్నముగా మారిపోయినది. ఆమెకులములో చాలామంది ధనముసంపాదించి, అనుభవించి పిదప పోగొట్టుకొన్నారు. కాని ఈమె అట్లుపోగొట్టుకొనలేదు. బుద్ధిపూర్వకముగా సత్కార్యములకై త్యాగమొనర్చినది.

సామాన్యముగా నిట్టివారు తాము సంపాదించిన దనుభవింపగల వారసులు లేనప్పుడు - ఎవ్వరినైన ఆడుపిల్లలను పెంచుకొని వారి కాటపాటల చెప్పి ఆ ఆస్తి వారి కప్పగించుట ఆచారము. ఈమెయు ముందు అక్క యొక ఆడుబిడ్డను పెంచినది. ఆమె - ఈమెవద్ద ధనసంపదకన్నను, వెలగల సుగుణసంపదయు, విద్యాసంపదయు గలదని గ్రహింపజాలక ఈమె కెన్నివిధములనో వ్యతిరేకములొనర్చి బాధింపసాగెను. అంత నామెనీమె తన ఇంటినుండి సాగనంపినది. కాని ఆమెను పెంచిన వాత్సల్యమును మాత్రము విడువలేదు. ఆమెకు పుష్కలముగా వేలకొలది ధనమిచ్చియే పంపినది. ఆ సౌజన్యత అరుదు. 'ప్రేమ ప్రతిఫలము కోరనిది'—అని గొప్పవారందరు చెప్పుచున్నారు. తన కపకారము చేయబూనిన వ్యక్తియెడలనైనను - ప్రేమవీడక సత్కరించిపంపిన ఈమె సంస్కారము గణనీయము.

కాని ఆమెకు తన వాత్సల్యము ననుభవింపను మరొకజీవితోడు అవసరమాయెను. అప్పుడొక కుక్కపిల్లను పెంచినది. ఆ కుక్క ఆమె కతిప్రేమాస్పదమైనది. ఆమెయెడ నదియు అట్టి విశ్వాసము, స్నేహము చూపునది ; ఒక్కనిమిషమును ఆమెను విడుచునదికాదు. ఆమె సంగీతము సాధనమొనర్చుచు 'సా పా సా' అనగానే ఆ కుక్క తానున్నూ - ఉదాత్తానుదాత్త స్వరములతో మొరిగెదట - ఎవరైనను అపస్వరములు పల్కరా - వారిపై 'బొంయ్యి' మనిపడి కరవబోయెడిది. ఆమెవద్ద ధనము నగలు దొంగలించుకొనిపోవుటకై దొంగలురాగా వారి నది పట్టియిచ్చినది. అట్టి విశ్వాసము, విజ్ఞానముగల కుక్క కొంతకాలముండి చనిపోయినది.

అంతట నామె యొక్క రామచిలుకను పెంచినది. ఆ రామచిలుకకు వెలగల పంజరము, నగలు అన్నియు నేర్పరచినది. దొరకిన పండ్లెల్ల తెప్పించి పెట్టినది మాటల నేర్పినది. పాటల నేర్పినది. ఆమె వర్ణములు సాధనచేయునప్పుడు అదియు యూలవేయుచు బంగారు గజలు కట్టిన కాలితో తాళము వేయుచు కలిసి పాడుచుండెడిది. ఆమె పాడుచు మధ్య మధ్య నిలిపినపుడు పిదప చరణమెత్తి అందించునది. ఆ చిలుక ఎంతో గారాబమున — ఆమె భుజమెక్కి, శిరమెక్కి ఆడుచు - ఆమె యందెంత యనురాగమో - అది మగచిలుకయునట, — కొంటెతనమున ఆమె నప్పుడపుడు ముద్దు గొనుచుండెడిదట ! కొంత కాలమున కాచిలుకయు గతించినది.

ఇట్లు తానమ్మిన పక్షియు తుదకు తన్ను తోడులేని పక్షినిచేసిపోగా ఆమెకు వైరాగ్యమున మనస్సు దైవము వంకకు ప్రాలినది. నిరంతరము సంగీతమున శ్రీత్యాగరాజకృతులందు రామకథా ప్రసంశయేగదా - ఆ కథా విశేషము నర్థము చేసుకొనగల సంస్కారమును ఉన్నది. శ్రీరామభక్తికుదిరి శ్రీరామ మందిర నొకటి ఇంటనే నిర్మించుకొని రాముని పటమును త్యాగయ్య పటమును అందుంచి అఖండము వెల్గించి

నిత్యపూజల గావించుచు భక్తిభావముననుండగా — రామభక్తాగ్రేసరుడగు త్యాగరాజు స్వప్నమున సాక్షాత్కరించి తన సమాధిని జీర్ణోద్ధారణ మొనర్పుమనికోరెను. ఆమె త్యాగరాజు శిష్య పరంపరలో చేరినయామె. కావున గురుభక్తి దైవభక్తికల్గి ఆమె ఈ పని చేబట్టినది.

సమాధి జీర్ణోద్ధారణకై తన నగల నన్నిటిని అమ్మివేసినది - రవలుచెక్కిన ఆమె వడ్డాణ మిప్పుడామెవద్దలేదు. ఆమె ఇప్పుడు చెవులకు పెట్టుకున్న కమ్మలు పూర్వపు వజ్రాల కమ్మలుకావు - వట్టి తెల్ల రాళ్ల కమ్మలే. పూర్వపు నగలన్నియు అమ్మివైచినది. అప్పుడు పాటకచ్చేరీలు చేయుచు ఈ కార్యమునకై ధనమార్జింప నారంభించినది. ఆ సందర్భమున నామె భిక్షాపాత్రగొని నన్ను చూచినది. నా కామె భిక్షాపాత్ర పూర్తిగా నింపుటకు శక్తిలేదు. యథాశక్తిగ నా తృణమునందుంచి — ఆమెను ఇతరుల కడకును గొంపోయి భిక్ష పెట్టించితిని. నాకు కొచ్చిరాజ కుటుంబమునగల పలుకుబడిచే అచ్చటికిని గొంపోతిని. శ్రీ నాగరత్నముగారికి కొచ్చిమహారాజావారి దర్శన మేర్పాటు చేసితిని. ఆ మహారాజు, వృద్ధుడు, జనకమహారాజువలె నిండుపేరోలగమున మంత్రి, పురోహిత రాజబాంధవులతో కూడి కొలువుండగా, — సులభవలె నీమె ప్రవేశించి — నిలిచి, — స్వవిరచితములగు రెండు సంస్కృత శ్లోకములను శ్రావ్యముగపాడి నమస్కార బాణముల వైచినది. అర్థగాంభీర్యముగల నా శ్లోకములను, ఆ చల్లని సంగీతమును వినగా నాయన కానమస్కారబాణములు పువ్వుటమ్ములవలెతాకి మైపులకరించినది. ఆ ఆస్థానమున ఎప్పుడును విద్వాంసులకు ఒక్కచేతికే తోడా వేయుట సాంప్రదాయము- ‘ట్లుగాక ఆయన ఈమెకు రెండు చేతులకు తోడాలు వేయించెను. ఇంకను ధనము, నగలు, చీరెలు మున్నగునవియిచ్చి సత్కరించెను. అదియే ఈ తాతకు - ఆ అవ్వకు ముఖాముఖి ప్రథమ పరిచయము. అప్పటినుండి నా యింట ఏ శుభకార్యమైనను ఆమె పాటకచ్చేరి తప్పక ఏర్పాటు చేయుచుంటిని. నా కుమార్తె చి॥ సౌ॥ శారద వివాహమునకు, మా శేషగిరి వివాహమునకు, ఈ భవనము ప్రారంభోత్సవమునకు - ఇట్లెన్నిసార్లో పిలిపించి నాశక్తికొలది సత్కరించితిని. బెంగుళూరిలో శాస్త్రి హోటలు అని యొకటున్నది. దానిని నేనే వారిచేత పెట్టించితిని. ఆ పెట్టినప్పుడు ఈమె పాట కచ్చేరీ జరిగినది. ఆయన లక్షలాదిగా పిదప నా హోటలుపై సంపాదించినాడు. ఆమెకు శారీర మింకను శ్రావ్యముగానున్నది. ఇప్పటికిని కచ్చేరీలు చేయుచుండును. కేవలము ఆమె సంగీత విద్వాంసురాలనియే కాదు, ఆమెను కచేరీలకు పిలుచుట-ఆమె చాల ధర్మాత్మురాలు; విద్వాంసురాలు; దైవభక్తిపరురాలు. అందుచేత అదృష్టవంతురాలు - కావున ఆమెవచ్చి పాటకచ్చేరీ లొనర్చినచో - ఆ సంస్థకు, ఆ దంపతులకు, ఆ కుటుంబమునకు వృద్ధియని అందరికి నమ్మకము; వాస్తవము కూడ. వైద్యునికి, వంటవానికి హస్తవాసి అని యొకటి యున్నది. అట్లే ఈమె రాకకు మంచి పేరున్నది. ఆమె మిగత పాటకురాండ్రవలె కేవలము పాటపాడి రూపాయలు చేతిలో వేయించుకొనిపోదు. ఆంధ్ర గీర్వాణములు చక్కగా చదివినది గావున చక్కని కవిత్వముగట్టి, వధూవరులను, సంస్థలను ఆశీర్వదించును. ఆ ఆశీర్వచనము ఫలించును. ఇప్పుడామె వెంకటగిరికి యొక పెండ్లికి వెళ్లివచ్చుచున్నది. (ఆ పెళ్లిలో వాజపేయాజుల సుబ్బారాయుడుగారు ఆశువుగా చెప్పిన పద్యములను వేరొకచో ప్రచురించి యున్నాము గృ॥ సం)

ఆమె సుకృతమంతయు తన గురుపరంపరకు సేవచేయుచుండుటయే. త్యాగరాజు పెట్టినదిబిక్ష కర్నాటక సంగీతపాటకులకు. ఎందరో వేలాది ధన మార్జించిరి. కాని ఒక్కరైనను త్యాగరాజారాధన ఏర్పాటు గావించినవారులేరు. ఆమెకే ఆభాగ్యముదక్కినది. అందుచే ఆకొరత తీర్చి ధన్యురాలైనది.

ఇప్పుడామెకు ఈగృహలక్ష్మి స్వర్ణకంకణము ఏల ఇవ్వదలంచితినో చెప్పవలసియున్నది. ఆమె దేవదాసీలు అని పిలువబడు కులమునకుచెందినది. నిజమున కాకులము దేవదాసీకులము కాదు. దేవాలయములు

సుమారు వేయిసం॥లకు కొంతముందే పుట్టినవి. అంతకుముందే ఈకులముకలదు. అప్సరసలు ఈజాతికి చెందిన వారే. వారు సంగీతము, సాహిత్యము, అభినయము, నృత్యము మున్నగు లలితకళలు నేర్చినవారు. ఎందరో ఋషులు, మహారాజులు ఈ అప్సరసలకు పుట్టినవారుకలరు; చంద్రవంశపు రాజులు ఊర్వసీ పురూరవుల సంతానము, సంతతికదా.

వీరిలో చాలగొప్పవారు జన్మించి గొప్పకీర్తి బడసిరి. తంజావూరురాజులవద్ద - ఇట్టివారు పలువురుండిరి. రంగాజమ్మయు, మధురవాణియు గొప్పకవయిత్రులై తంజావూరునాయక రాజుల ఆస్థానమందుండిన వారు. వీరు తెలుగులోను సంస్కృతములోను కవిత్వములల్లనేర్చినవారు. వీరిలో రంగాజమ్మ 8 భాషలలో కవిత్వము చెప్పగల్గినది. మధురవాణి రాజువ్రాసిన తెలుగురామాయణమును సంస్కృతములోనికి మార్చినది. అంతకుముందు సంస్కృతమును తెలుగుచేసిరేగాని తెలుగు సంస్కృతము చేసినవారరుదు. వీరిరువురు తమ రాజులచే కనకాభిషేకమను గౌరవమును పొందినవారు. అంతకుముందు పురుషకవులైన - శ్రీనాధుడు, మల్లినాధుడు వీరిరువురే ఈ గౌరవముపొందిరి. కృష్ణాజమ్మ, రామభద్రాంబలును. ఇట్టి కవయిత్రులు. నాయకరాజుల పిదపవచ్చిన మహారాష్ట్ర రాజులవద్దకూడ నిట్టికవయిత్రులుండిరి - వారిలో ముద్దుపళని కడపటిఆమె. ఆమె రాధికా సాంత్వనమను శృంగార ప్రబంధము వ్రాసినది. ఆ గ్రంధము నీమెయే ప్రచురమొనర్పించినదని మున్నే చెప్పియున్నాను. ఆమెపిదప ఆకులమునపుట్టి ఆసాంప్రదాయమును నిలిపిన కవయిత్రి, విద్వాంసురాలు ఈమెయే - ఈమె విద్యాసుందరి; గానకళావిశారద. భక్తురాలు, త్యాగి - బహుశా, ఈమెతోనే అట్టి విద్వత్సాంప్రదాయము తుదముట్టుచున్నదేమో! కావున ఈమె కనకాభిషేకమున కర్హురాలు. కాని అట్లొనర్చుటకు ఆరాజులు లేరు. నా కందుకు శక్తిచాలదు. కావున ఆ విద్వత్సాంప్రదాయమును గౌరవింపవలయుననే అపేక్షతో - కనకాభిషేకమునకు బదులు కనక కంకణమును సమర్పించుచున్నాను." అని కంకణము నామె కందించిరి.

ఆవెంట శ్రీ శ్రీ శ్రీ విజయనగరం మహారాణీసాహెబా విద్యావతీదేవిగారు - హిందీలో నిట్లుపన్యసించి శ్రీ నాగరత్నముగారికి చెన్నపురి మహిళామణులతరపున "త్యాగసేవాసక్త" అన్న బిరుదునొసంగిరి. ఆ బిరుదుపట్టమును వేరొకచో ప్రచురించియున్నాము.

శ్రీ శ్రీ శ్రీ విజయనగరం మహారాణీసాహెబా విద్యావతీదేవిగారి యుపన్యాసము.

నేను ఆంధ్రదేశమునకు కోడలిని. అందుచే ఆంధ్రభాషలో ప్రవీణులైనమీయెదుట తెలుగులో మాట్లాడుటకు కొంచెము జంకుగా ఉంటుంది. కావున హిందీలో మాట్లాడుతాను.

నేడు గృహలక్ష్మి స్వర్ణకంకణంపొందుచున్న శ్రీమతి బెంగుళూరు నాగరత్నమ్మగారిని నేను బాగాఎరుగుదును. దానకేసరియగు డాక్టరుగారు వీరికి కంకణమును బహూకరించుట సంతోషదాయకము. చెన్నపురి మహిళామణులము ఈమెకు "త్యాగసేవాసక్త" అనే బిరుదుకూడా ఇచ్చుచున్నాము. ఈ బిరుదమున కీమె ఎంతో తగియున్నదని నా తలంపు. ఈమెకు ఒకచేతికేకాదు; రెండుచేతులకూ కంకణాలుతొడిగినా విశేషం కాదు; ఏలనంటే ఆమెకు సంగీత సాహిత్యములందుగల పాండిత్యము అటువంటిది.

ఈమె త్యాగరాజస్వామివారి భక్తురాలు. అదియునుగాక త్యాగరాజులవారి శిష్యపరంపరలో నీమె మూడవది. మా ఉత్తరహిందూస్థానమున మీరాబాయి అనే భక్తురాలుండెడిది. ఆమెయు ఈమెవలెనే అనేకకష్టములుపడినది. అన్నికష్టములకోర్చి ఈ భక్తురాండ్రు భక్తివిడువక నిలుపుకొన్నారు.

ఈవిధముగా ఏటేటా విదుషీమణులకు స్వర్ణకంకణములొసంగుచున్నారు డాక్టరు కేసరిగారు. వీరు

నారీలోకానికి ఒట్టిఔషధములేగాక విజ్ఞానౌషధాన్నికూడా ఇస్తూఉన్నారు. వీరు చిరంజీవులై ఇట్లే తమ దానములతో లోకానికి ఇంకా ఎంతో ఉపకారంచేయునట్లు అనుగ్రహించుమని నేనుదేవునిప్రార్థిస్తున్నాను.

అంత శ్రీమతి బెంగుళూరు నాగరత్నంగారు - గృహలక్ష్మి స్వర్ణకంకణమును, "త్యాగసేవాసక్త" బిరుదమును రెంటిని స్వీకరించుచు - ఉభయులకు కృతజ్ఞతాపూర్వక నమస్కారములొనర్చి, సభవారికి శిరము వంచి, మృదుమధురగంభీరస్వరమున, హావభావ, విలాసవైఖరులతో హాస్యవచఃశ్రీ మేళవించి, తానభ్యసించిన సంగీతసాహిత్యాభినయాదిశాస్త్రకళలెల్ల వెల్లడించుచు, సభవారెల్ల సుమారొక్కగంటకాలము మ్రాన్పడి నిశ్శబ్దముతో, చెవిగోసికొని విన నత్యద్భుతముగ నుపన్యసించిరి. అది యొక ఉపన్యాసమునజెల్లదు. హరికథా కాలక్షేప మననగునేమో! కీ॥ శే॥ ఆంధ్రరత్న దుగ్గిరాల గోపాలకృష్ణయ్యగారిపిదప నవరసస్ఫూర్తితో నిట్లుపన్యసించిన వారిని మరి విని, కని ఎరుగము—అని సభాసదులు కొందరు పల్కిరి. ఆ యుపన్యాసమధ్యమున నామె ఉదాహరణముగా అక్కడక్కడ కొన్నికీర్తనలపాడెను; గళమునందేరాగాలాపన మొనర్చువిధముచూపెను. మరియు కేసరిగారినిగూర్చి తామువ్రాసిన పద్యములను రాగయుక్తముగా జదివెను. వానినివిన్న పిన్నవారు - 71 సం॥ నకే ఈమె శారీరమింత హాయిగొల్పుచున్నదే - ఆమె యౌవ్వనదశయందింకెంత హాయిగానుండెడిదో; దానిని పూర్వం విన్నవారు-ఎంతటి నోములునోచిరో-అని భావించిరి. వెనుక విన్నపెద్దలు - తిరిగీ తమజీవితకాలములో మరియొకమారు విననోచితిమిగదా యని ఆనందించిరి. ఆమె మధ్యమధ్య నేటిపాటకులు, అధ్యాపకులుసహా—సాధనగాని, సంస్కారముగాని లేమి ఎట్లు—రాగాలాపన ముపట్ల, వర్ణముల పాడుసమయమున ముఖవికారములు సల్పి, కొండకేకలు వేయుదురో—సూచించి సభాసదులను పొట్ట చెక్కలగునట్లు నవ్వించిరి.

### శ్రీ నాగరత్నముగారు కేసరిగారినిగూర్చి వ్రాసి చదివిన అభివందన పద్యములు.

వృద్ధుఁడవీవు జ్ఞానమున వృద్ధుఁడ వైతివి సుమ్మ ; నేనునున్
వృద్ధను; జ్ఞానమార్గమున వృద్ధనుగా; నటులైనఁ గేసరీ!
వృద్ధులకిచ్చు కంకణము వృద్ధిగ నుండు నటంచు నెంచితో ?
వృద్ధుల సూక్ష్మబుద్ధి హితమెంతయుఁ గూర్చును చిన్నవారికిన్.

కాంచితి స్వర్ణమాలికలఁ గాంచితి బంగరు కంకణంబులన్
గాంచితి రత్నహారములఁ గాంచితి నాణెము లెన్నియేనియున్
గాంచితిఁ బెక్కురాట్సభలఁ; గాంచినవన్నియు నొక్కయెత్తు; నీ
కాంచుట నొక్కయెత్తు ; గృహకాంతల కంకణమాటఁ గేసరీ.

ప్రథిత త్యాగరాయని భక్తురాల నగుటఁ
గాంచఁ జేసితి గృహలక్ష్మి కంకణంబుఁ
ద్యాగరాయని వోలె బల్ త్యాగమెఱిఁగి
పృథ్విలోపలఁ గేసరీ ! వృద్ధిఁగొనుము.

కాంతల మేలుబంతియనఁగాఁదగు నీగృహలక్ష్మి కంకణం
బెంతయు శ్లాఘనీయము మహీతలమందున నెందుఁ జూచినన్

కాంతల వల్లనే కలుగుఁ గాంతుల కెల్లెడ గౌరవం బటం
చింతుల గౌరవించు నిను సేవ్వరుఁ డోముత మెల్ల భంగులన్.

ఈ "గృహలక్ష్మి" కంకణము లిచ్చుచుఁ గాంతల నెల్లఁ బ్రోచుచున్
ద్యాగమునందు ధీబలము నందు నిదానము నందు మేటి యు
ద్యోగమునందు సత్కళలయందు సువారమునందు సద్గుణ
శ్రీ గరిమంబుఁగల్గి యభివృద్ధిని గాంచుతఁ దెల్గు భూమిలోన్.

ఆ తర్వాత వరుసగా గృహలక్ష్మిని, కంకణగృహీతలైన నాగరత్నం గారిని, దాతలైన కేసరిగారిని అభినందించుచు కవులు కవయిత్రులు వ్రాసిన పద్యములు చదువబడెను.

మున్ముందు అధ్యక్షురాలు శ్రీమతి గిడుగు లక్ష్మీకాంతమ్మ గారు వ్రాసిన పద్యములను శ్రీమతి కంచిభొట్ల జానకీరాణిగారు శ్రావ్యముగ చదివిరి. ఆ తర్వాత కోటసోదరకవులు వ్రాసిన పద్యములను వారిలో పెద్దవారు సుబ్రహ్మణ్య శాస్త్రిగారు చదివిరి. అంత్యమున సభాముఖమున ఆశువుగాకూడ నొక పద్యమును చెప్పిరి. తర్వాత కేసరీవిద్యాలయము విద్యార్థి చి. ము. వెంకట్రావు వ్రాసిన పద్యములను, నెల్లూరి వాస్తవ్యురాలు పూర్వము గృహలక్ష్మీస్వర్ణకంకణ గృహీతలునగు శ్రీమతి చిలకపాటి సీతాంబగారు వ్రాసిపంపిన పద్యములు, గతమాస మధ్యమున వెంకటగిరిలో - సువరం రాజాగారు శ్రీ శ్రీ రాజావిజయ అప్పారావు బహద్దరువారి ప్రథమ పుత్రికా వివాహ సమయమున కచ్చేరీ నొనర్చిన శ్రీమతి నాగరత్నము గారినిగూర్చి — శ్రీ వాజపేయాజుల రామసుబ్బారాయుడుగారు ఆశువుగా చెప్పిన పద్యములును (వారంపగా) చదువబడినవి. వీని నన్నిటిని విడిగా ప్రచురించితిమి.

తదనంతరము ప్రెసిడెన్సీ కాలేజీలో ప్రొఫెసర్ డాక్టరు శ్రీపాద గోపాలకృష్ణమూర్తి ఎం. ఏ. గారున్నూ శ్రీ బాల పత్రికా సంపాదకులు న్యాయపతి రాఘవరావు గారున్నూ ఉపన్యసించిరి.

శ్రీ గోపాల కృష్ణమూర్తి గారు శ్రీ నాగరత్నముగారి జీవిత విశేషములను కొన్నిటిని తడవి — "ఆమె నడిచే దేవాలయం. చూచి ధన్యుణ్ణవుదామని వచ్చాను. ప్రశంసించే భాగ్యముకూడా కలిగింది." అన్నారు.

శ్రీ రాఘవరావుగారు తాము చిన్నవారుగా నున్నపుడు తమ తండ్రిగారు ఇంగ్లాండునుండి అపరూపమైన గ్రామఫోనున్ను ప్లేట్లున్ను తెచ్చినారనిన్ని ఆ ప్లేట్లన్ని - ఇంగ్లీషు పదాలనిన్ని, పిదప మనభాషల్లో ప్లేట్లు వచ్చినవనిన్ని, తొలుతగా తాము గ్రామఫోనుమీదవిన్న భారతీయ సంగీతము శ్రీ నాగరత్నంగారిదే ననిన్ని చెప్పిరి.

ఆ తరువాత అధ్యక్షురాలు శ్రీమతి గిడుగు లక్ష్మీకాంతమ్మ గారు తమ ఉపన్యాసమున నీ విధముగా చెప్పిరి:—

నేడు సుదినం. ఈ సభకు శ్రీ విజయనగరం మహారాణీగారు విచ్చేయడం చాలా సంతోషం. నేనేదో కొంచెంచదువుకున్న విద్యాభిమానిని గాని విద్యావతినిగాను. అయినను శ్రీ కేసరిగారు నన్నీగృహలక్ష్మీ జయంత్యుత్సవమునకు అధ్యక్షతకు అహ్వానించినందులకు వారికి నా కృతజ్ఞతాభివందనాలు. ఇటీవల కొంతకాలమయి ప్రజలలో నూతనచైతన్యముకల్గి సంస్కృతి యొక్కవగావికసించి, నేటిమనసోదరీ మణులలో కొందరు విద్యావతులై ఉన్నతోద్యోగములు చేయుచున్నందులకు మనము చాలా సంతోషించ

వలసియున్నది. ఈ యున్నతవిద్యాశిక్షణ ఎంతగొప్పదైనను, ఇందు కళలయెడలకంటె, శాస్త్రములందును దేశీయవిద్యలకంటె విదేశీయసంస్కృతియందును ఆదరాభిమానములు ఎక్కువ కాన సాంప్రదాయసిద్ధములయిన సంస్కృతియెడల ఆదరముతగ్గుచున్నది. మంచి యేదేశమువారిదైనను గ్రహించవలసినదే కాని, మనసంప్రదాయములందుండు మంచినిగ్రహించక దానిని పరిత్యజించుట శోచనీయము. దేశీయకళలకును, విద్యలకును అందులో ముఖ్యముగా స్త్రీలకు విశిష్టమైనవాటికి, తగినంత ప్రోత్సాహము ప్రభుత్వపు విద్యాసంస్థలలో కనబడుట లేదు. ఆ లోపమునుదీర్చుటకు దేశములోజరుగుచున్న ప్రయత్నములలో ఎక్కువ ప్రశంసకుపాత్రమైనపని శ్రీ కేసరిగారివలన సాగుచున్నదని చెప్పకతప్పదు. వారు స్థాపించి పోషించుచున్న విద్యాసంస్థ నేటిబాలికలకు ఆనందదాయకముగ వెలయుచున్నది. వారి గృహలక్ష్మి సార్థక నామముతో నేటికి దరిదాపు 22 సం|| నుండి ఆంధ్రుల గృహములకువిజ్ఞాన వికాసములు కలిగించుచున్నది. ఏటేట వారు జరుపుచున్న గృహలక్ష్మి జయంత్యుత్సవముతోపాటు గావించుచున్న స్వర్ణకంకణ ప్రదానోత్సవము స్త్రీ మండలమునకు సర్వమంగళ ప్రదమైనది. ఇంత వరకు కావ్యరచన, పత్రికా నిర్వహణ, విద్యాశిక్షణ, చిత్రలేఖనము సర్వలో ముఖమైన సాంఘికసేవ గావించి, ఆంధ్రదేశమందు ప్రఖ్యాతిగాంచిన విదుషీమణులు, కేసరిగారి కరకమలములనుండి, స్వర్ణకంకణములను బహుమతిగా పొందియుండిరి: ఈ యేడు పైన వివరించిన లక్షణములతోపాటు సంగీతమునందును విశేష పాండిత్యము నార్జించి, గంధర్వస్త్రీలకు విశిష్టమైన మృదుమధుర గానకళా కౌశలముతో శ్రోతల కర్ణపుటముల కమృత మొలికించు శ్రీమతి బెంగుళూరు నాగరత్నంగారికి స్వర్ణకంకణ ప్రదానము గావించుటచేత శ్రీ కేసరిగారి సారస్వత బహూకరణము సంపూర్ణముగా సార్థకమైనదని నా అభిప్రాయము.

స్వర్ణకంకణ ప్రదానమును ఉదారభావముతో గావించు కేసరిగారికి అందరి పక్షమున - నా పక్షమున అనేక కృతజ్ఞతాభి వందనము లర్పించుచు. వారికీ వారి కుటుంబమునకున్ను ఆయురారోగ్యములు కలుగుగాకయని ప్రార్థించుచు శ్రీమతి బెంగుళూరు నాగరత్నంగారిని అభినందించుచున్నాను.

అధ్యక్షురాలి యుపన్యాసముతో సభముగిసినది. పిదప శ్రీ కె. జానకమ్మగారు బి. ఏ మ్యూజిక్ లెక్చరర్, గవర్నమెంటు ట్రెయినింగ్ కాలేజి, తిరుచూరు, తమ చక్కని గానముచే సభ్యవారి నానందపరచిరి. ఆమెకు సాహాయ్యముగా చిరంజీవి వసంతకుమారియు పాడినది.

జానకమ్మగారి గాన మధ్యమునందు ఇంచుక వ్యవధిగా విచ్చేసిన శ్రీ ప్రొ. సాంబమూర్తిగారు నాగరత్నముగారినిగూర్చి ఇట్లుపన్యసించిరి:—

శ్రీ నాగరత్నముగారు సంగీత శాస్త్రమున గొప్ప విద్వాంసురాలు - గానకళయందు గొప్ప నేర్పరి. మా చిన్నతనమునందు స్త్రీ పాటకులకంత మన్ననలేదు. పురుషగాయకులు చాలప్రసిద్ధులై యుండిరి. కాని ఆ రోజులలోను శ్రీ నాగరత్నంగారికీర్తి కడుప్రసిద్ధమైనది. గాయకులందరును ఆమె విద్వత్తుమ్రోల జంకేవారు. ఆమె పేరు — పొడియక్షరముల — బి. ఎన్. ఆర్. అని మారు మ్రోగుచుండేది. ఆమె త్యాగరాజారాధనకు పునాదివేసినది. అట్టి ఆమెకు శ్రీ కేసరిగారు గృహలక్ష్మి స్వర్ణకంకణమిచ్చి గౌరవించినందులకు గానకళాకోవిదులందరు — సంగీతకళనే గౌరవించినట్లుగా భావించి గర్వించుచున్నారు. ఈ సమ్మానముతో నీ కంకణ ప్ర దా నో త్స వ ము సంగీత ప్రపంచమంతయు తెలిసి బహుప్రకటితమైనది. శ్రీ నాగరత్నమ్మగారు చిరంజీవియై ఇట్టిసన్మానముల నింక నెన్నిటినో బడయుగాక. ఇట్టి సన్మానమామె కొనర్చిన శ్రీ కేసరిగారును చిరంజీవియై వర్ధిల్లుదురుగాక.

పిదప మంగళము పాడబడెను. శ్రీ నాగరత్నముగారును ఉత్సాహముతో లేచినిలిచి, కరతలములతాళము వేయుచు వారితోకలిసి మంగళము పాడెను. అంతట ఉత్సవము ముగిసెను.

---



శ్రీ నాగరత్నమ్మగారి నాయకత్వమున నడుచుచున్న
తిరువాయూరు మహిళాసంఘము.



త్యాగరాజాశ్రమం—తిరువాడి.

కూర్చున్నవారు ఎడమనుండి కుడికి : శ్రీ కే. యం. కృష్ణమూర్తి (త్యాగరాజ నాటకర్త, నెల్లూరు).
రాముడుభాగవతర్, శ్రీ నాగరత్నమ్మ, సి. వి. రాజగోపాలాచారి, నే. శ్రీ కృష్ణమూర్తి (నెల్లూరు)

గృహలక్ష్మి స్వర్ణకంకణ ప్రదానోత్సవసమయమున

# దాతను, గృహితను, గృహలక్ష్మిని

అభినందించుచు కవులు, కవయిత్రులు పంపిన పద్యరత్నములు

---

స్త్రీలపాలిటవగు జయశ్రీసుతల్లి తల్లి నీకీర్తిగొనియాడ తరమె దరమె
నిన్ను బురుడించి వివరింప నేరికైన అమ్మ గృహలక్ష్మి మానుతుల్ నెమ్మిగొమ్మ
మున్ను స్త్రీవిద్య కొరవడియున్నవేళ మానినీతతి దీనత గ్రమ్మువేళ
ఒక్కొక శతాబ్దమున కొక్కరొక్కరుగను భువిని వెలసిరి స్త్రీజనాభ్యుదయమునకు
తొల్లి మైత్రేయి గార్గియు మొల్ల వళిని మోహనాంగియు వేంగమ మున్నుగాగ
అలరు విదుషీమతల్లుల నతిముదమున ఆదరించిరి కృష్ణరాయాది నృపులు
మరల నాటికి నేటికి మానవతుల నెంచి పూజించి మహిసత్కరించి మించె
ధర్మ పథవర్తి యంచితోదారకీర్తి దాంతి సౌజన్యధన్య వదాన్యమూర్తి
కేసరి మహాశయుండు ధీభాసురుండు.



విద్యాసుందరివంచని సద్యశులు నుతింప నెగడు సన్నుతగుణ నీ
విద్యాపాటవ గరిమము పద్యముల నుతించి తెలుప వలతినె తలపన్.
హేగోపాలక ! హేకృపాజలనిధే ! హేమాధవా ! యంచు సు
శ్రీగాంధర్వ విలాసభాసురగతిన్ జెల్వొంద వీణాస్తితిన్
రాగాలాపనజేయు మాధురికి పెన్రాల్ నీరులై పారవే
నీ గానామృత రామణీయకత వర్ణింపం దరంబే ధరన్.
చదువుల సరస్వతివటంచు సంతసించి నెమ్మిమనకూర్మి
గృహలక్ష్మి నీకరమునం గరము సంప్రీతి నలరించె కంకణంబు
ధర్మ వర్తనుజేరు అర్థంబు యిటులె యొలమిసత్పాత్ర
త నెరింగి యొసగుజగతి.

చిలకపాటి సీతాంబ.



(ఇటీవల వెంకటగిరిలో నేప్పటికప్పు డాశువుగఁజెప్పిన పద్యరత్నములు)
నీకవితా విహారమును నీదగు గానకళావిలాస సు
శ్రీకర భోగ సంపద సమృద్ధియు మెత్తని శబ్దజాలమున్

నీకుఁగలట్టి ప్రజ్ఞయు మనీషయు నెల్లకవీంద్రులెంతయుం
జాకొనినారు గొప్పదని నాపలు కేటికి నాగరత్నమా!

జ్ఞానమునందుఁగాని మతిఁగ్రమ కవిత్వపటుత్వ తత్త్వమం
దైననుగాని సత్కళలయందునఁగాని మనోహరప్రభా
గానకళా విలాసమునఁగాని నిదానమునందుఁగాని, ని
న్నెనళినాక్షియుం బురుషుఁడేనియు గెంటఁగ లేదు చూడఁగన్.

ఆంధ్రదేశంబునందు నెందైనఁగాని పేరుమోసిన కాంతవై వెలుఁగుచుంటి
వంచు వింటయేగాని నేఁగాంచి యెఱుఁగ నరయఁగల్గితి నిచటఁగల్యాణమందు.
వార్ధకంబునఁగూడ నె బానసంగఁ దన్మయతఁగూర్చు నీగానధారగరిమ;
వృద్ధదశయందె కళలన్ని వృద్ధిఁగాంచు నిందుఁగల రహస్యంబుఁ గవీంద్రుఁడెఱుఁగు.
పరమభక్తురాలవనుచుఁ బరమధర్మ తత్పరతఁగాంచి మించిన ధన్యవంచు
వింటి నానంద మెంతేనిఁగంటి నిట్టి సుగుణ సంపద కొనితెచ్చు శోభలెల్ల.
నాగరత్న మటన్న గానమున మేటి; హరికథలయందుఁ బెద్దనారాయణుండ
టంచు లోకమందింత విఖ్యాతిఁగల్గె భారతీయుల సౌభాగ్యమిద్ది.

బ్రదుకుము పెక్కువర్షములు భారతదేశమునందు నెల్లరుం
సదములకీర్తియుం సుగుణసంపదఁగాంచిన ధీరవంచు, బల్
ప్రిదులని భక్తిఁగాంచిన వివేక గుణాఢ్యవటంచు మెచ్చఁగా
బ్రదుకుము వాజపేయకవిరాయని దీవన లివ్వి నమ్ముమా!

భక్తియన్ననో ముందంజవైతువంచు భూసురులయందు భక్తియుఁబొసఁగునంచు
నొక్క నవరత్నహారంబు నొసఁగినాడఁ కవియునాట దీపించితిఁగాంతుఁదీర
ప్రాక్కవులవోలె ధీశక్తిఁబడయకున్న భీమకవివోలె వాక్సిద్ధి వెలయకున్నఁ
దల్లిగాయత్రి దయచేతఁ దనరునంచునెంచి సుబ్బరాయండు దీవించుకొట్లు.

వాజపేయాజుల రామసుబ్బారాయుడు.



(కేసరిహైస్కూలు విద్యార్థి చి॥ ముళ్లపూడి: వెంకట్రావుగారు రచించిన పంచరత్నాలు)

ఇచ్చితివేటనేట సిరియింటికి రూపగు స్వర్ణకంకణం
బచ్చపుఁగైత సేయగల యంగనలన్ గవిరాణివాణికం
దిచ్చితి వంతటన్ బలుకు కేటదనంబు తెలుంగుస్త్రీలకున్
జెచ్చెఱలకులిచ్చితివి: చెల్వుగ వాణికి నాంధ్రభోజుడా!

చల్లని చూపులంబరపు సాగరపుత్రిమతల్లి డాసి యా
పల్లవ సదృశంబగుచు వన్నెలఁజల్లెడి తల్లిచేతులన్
వల్లకిమీటి యుల్లముల ఫుల్లముచేసెడి వాణిచేతులన్ఁ
మెల్లననుంచి తీవిపుడు మానిని కిచ్చిన పైడితోడతోన్.

అలరులంబోలి లలితమైయలరు తెలుఁగు తెనుగుబడిలేక చెన్నలోఁ దల్లడిలగ
తెలుగు కరవును దరిమితి తెరచిబడుల తెలుఁగుజోతల, కేసరీ! దయతొ గొనుమ.

లోకములనెల్ల నానంద లహరిముంచు లోకమెరుగని పసిపాప లాదిగాను
భీకరులకును బాపంపు భీరువులకు శాంతినిచ్చును సంగీత సుధలు గాదె.

సకల జనులకు సంతోష సుధల నొసగు నాకలోక నివాసినా వాణీ నీవు
భక్తితో భవద్వాణిలోఁబరగ నిల్చి ధన్యవైతివి నాగరత్నామ తల్లి.



(రచన:—కవిచంద్రులు, కోట సోదరకవులు, అష్టావధానులు)

శ్రీమతి బెంగుళూరు కులసింధు హరిప్రియ నాగరత్న కాం
తామణికిన్ జిరాయువు నుదారమనంబున నిచ్చుఁగాత, మ
ర్త్యామరవందనీయ సుగుణాభరణోజ్జ్వల గాత్రభారత
క్ష్మామహనీయదేవి, యుపకారపరత్వ దయార్ద్రచిత్తయై.

సరసవ్యోమనదీ ప్రవాహ రభటీ సంగీతసాహిత్య సా
గరసంపత్తికిరాణి, వాణిసతముల్, గారుణ్యయుదృష్టి శ్రీ
కరముల్ నీపయిఁ గ్రుమ్మరించుటను, తద్గానంబు సొమ్మయ్యె, కే
సరియీనాఁడు సువర్ణకంకణమునన్ స్థాపించె తత్సత్యముల్.

నిమ్నోన్నతస్థాన నియతిమై ప్రవహించు భాగీరథీ వేగ రాగపటిమ,
కోయిలపాటకు కులుకుతళ్కులునేర్పు కమనీయ సుకుమార కంఠరవము
కఠినపాషాణాలఁ గరగింపఁజాలిన వరరసో దంచిత భావగరిమ
పలుకాడ నేరనిపాపల మెప్పించు నసమాన తాళలయాదిగతులు
తనరుచున్నట్టి విమలగాంధర్వ విద్య బాల్యమందున నీకుగ్గుపాలతో డఁ
గరపినట్టిదికాన, నీసరిజగాన నరయఁగా లేము! నాగరత్నమ్మ! పడఁతి!

కేసరి కంకణంబిడఁగ కేసరి కేసరి, కేలఁదాల్చనీ
కేసరి, గాని యేరిపరికింపఁగ "గానకళావిశారదో"

ల్లాసవికాస సద్బిరుద లాలసులైన విలాసినీమణుల్ !
నీసరివారలున్న ధరణీస్థలి కేసరితో సములుందురే! కదా!

సద్యోజాత శిరీషకోమలమునా సంగీత విద్యాదిసం
పద్యోగమ్ములునీకు లభ్యమగుటన్, భావించి, మావాణినీ,
కుద్యత్ప్రేమనొసంగె పద్యమణులన్, ఉత్సాహినై యీసభన్
"విద్యాసుందరి" నాగరత్నమసతీ! స్వీకారమున్ గాంచుమా!



(సభలో ఆశువు)

గిడుగువారలు అధ్యక్షు కీర్తిదనర
శ్రీవిలాస విద్యావతిదేవి యొప్ప
దాత కేసరి, రత్నగృహీతఁగాఁగ
కోటసోదర కవిపద్యధాటి వరల
ఔర! గృహలక్ష్మికి జయంతి హర్షమొదవె.



శ్రీలక్ష్మి లలనానిభ శీలా! శారద సమాన చిత్తవిశాలా!
ధీలోలా! కేసరివర బాలా! గృహలక్ష్మినీకు బహువిభవంబుల్.

శారదవౌదు, సత్కళల శైలజవౌదు సుభాగ్యరేఖలన్
శ్రీరమవౌదు సంపదల, సేమమెలర్ప త్రిదేవతాకృతిన్
ఆరయ సర్వతోముఖగ నాంధ్రవధూటికి చేరుచుక్కవై
గౌరవమొందినావు బుధకాండముమెచ్చగ నాడునాటికిన్.

మహిళామణులచేతి మాణిక్యమైవెలసి రాణించుచున్నగృహ లక్ష్మివీవు
విజ్ఞానచంద్రికల్ వెలయింపగాజేసి రాణించు సద్గృహ లక్ష్మివీవు
పాకకళాశాస్త్ర పద్ధతుల్ దెలుపుచు రంజిల్లు వరగృహ లక్ష్మివీవు
గృహవైద్యవిద్యసత్ప్రేమ బోధింపుచు రాణింపగల గృహలక్ష్మివీవు
కలిమి కేసరినిలయాన ఘనతజెంది క్రమకాంతుల విలసిల్లు కళలుగల్గి
ఆంధ్రభాషకుచేయూత నందజేసి వరలుచుండుటనీ పుణ్యఫలము గాదె.

ఉగ్గుబాలనుగల్పి యున్నతాశయములు తండ్రియై కేసరి దరి మెలఁగ
గానవిద్యాకళా కవితప్రపూజ్యతా మహిళామణీలోకమాన్యమమర

వివిధప్రసంగ సద్విజ్ఞాన పూజ్యులౌ సాధ్వీమతల్లులు సరస నుండ
ఉభయభాషాప్రవీణోన్నతిఁ గన్నట్టి కాంతామతల్లులు కరముబట్ట
కళల పెంపొందఁ గొదువేమి కలుగునీకు నవ్యభావోన్నతులు మది నాట్యమాడ
ఆంధ్రభాషావధూటీ విహారసీమ వనఁగ వర్ధిల్లు ముచ్చట లలరగాను.

విద్యయేవనితకు సద్యశంబంచును సాటించు నీదు ప్రచండశక్తి
రచనాచమత్కృతుల్ లాలించిపాటించి నిరతమ్ముకృషిచేయు నీదుప్రవృత్తి
కవితకున్ చిత్రలేఖన గానవిద్యకున్ మోదమొందగలట్టి నీదురక్తి
విదుషీమణులభావి ముదముతో దిలకించి కంకణాల్ దొడుగు సత్కారవృత్తి

అఖిల దిశలందువెల్గె నయ్యారె యనగ సాటివత్తురె నీకొరుల్ మేటివీవు
వసుధ కేసరి నోములపంటవౌట ధరణి వర్ధిల్లుమా చంద్రతారకముగ.

మహిలో సత్కళలభ్యసింపదగు సన్మార్గంబు జూపింపగా
రహిమించన్ జననంబునొందితివి నిన్ లాలించి ప్రేమించుచున్
గృహలక్ష్మల్ తమ హస్తకంకణముగా గావింప నీభాగ్యమో
గృహలక్ష్మీ! బహుదీవనల్‌బడసి సత్కీర్తిన్ విరాజిల్లుమా.

కాంతల సత్కరించి కర కంకణభూషితురాండ్రజేయు సు
స్వాంతముగల్గి గానకవి పండితగౌరవమన్న నీ కిలన్
ఎంతో ముదంబుగల్గ బుధులెన్నుచు మెచ్చిరి నీదుసేవ, నీ
సంతత కార్యదీక్ష సువిశాలత గూర్చును తెన్గుభాషకున్.

పరమోత్సాహముతోడ సంతతము దైవారాధనల్ సల్పుచున్
చరితార్థంబు గణించుచుంటి విలలో సౌఖ్యం బదేనంచుఁ శ్రీ
హరితుల్యుండగు త్యాగరాజగురునిన్ ధ్యానించి పూజింపగన్
ధర నీజన్మము సార్థకంబయెను విద్యాసుందరీ, ధీమణీ!

గాంధర్వవిభవంబు గంగాప్రవాహమ్ముగా పొంగిపొరలించు కాంతవమ్మ
ప్రణవగానముబోలు భావగానముచేత మురిపింపగా జాలు ముదితవమ్మ
కలకంఠనిభమైన కంఠనినాదాలు పలికించు సత్కళా ప్రౌఢవమ్మ
కర్ణపేశలమైన గానామృతముచేత మెప్పింపగా జాలు మేటివమ్మ

నీదు గానమ్ము నీజ్ఞాన నిశ్చలతకు ముదముగల్గును మాస్వాంత సదనములకు
కరము కేసరిదత్త కంకణముగొనుట గానవిద్యాకళావతీ కలితకీర్తి.

తొలిజన్మంబున నెట్టిపూజలనుసంతోషమ్ముతోఁ జేసితో
చెలియా! మాధురి జిల్కు గానమును సుశ్రీలొందగా బాడ ని
ర్మలభక్తిన్ మదినిల్పి మానసిక సామ్రాజ్యమ్మునీవొందినా
విలలో సౌఖ్యమనంగ నీదె భువినీ కింకేమి లోపంబగున్.

మిసిమిపసిడికి నెత్తావి పొసగినట్లు గానమునకును జ్ఞానంబు గల్గెనీకు
గురుపదంబులు సద్భక్తి గొల్వగాను ఆత్మశక్తి యొసగు పరమాత్ముడెలమి.

గానము నీదుసొమ్ము కరకంజమునందున కంకణమ్ము ఓ
మానిని! దాల్చుమమ్మ యసమాన మహోన్నతి నిచ్చు నీదు స
న్మానము భామినీమణుల మాన్యతకున్ దగుసూత్ర మెన్నగన్
గానకళాకలాపములు గ్రాలుట సత్సతులందె నెచ్చెలీ! -

అఖిలశుభమస్తు మహిని దీర్ఘాయురస్తు బహుళకళ్యామస్తు సౌభాగ్యమస్తు
మహితమంగళమస్తు సన్మానమస్తు సకలజయమస్తు గృహలక్ష్మి సౌఖ్యమస్తు

శ్రీ గిడుగు లక్ష్మీకాంతమ్మ.



# సందేశములు

తిరువణ్ణామల శ్రీరమణాశ్రమం సర్వాధికారి శ్రీ నిరంజనానందస్వామివారిట్లు వ్రాయించిరి:

మీరంపిన గృహలక్ష్మి జయంత్యుత్సవాహ్వానపత్రికను శ్రీభగవాన్ వారి పాదపద్మములకడ నుంచితిమి. నాటికి నాటికి ఉపయుక్తమగు సేవ గావించుచు, ఇట్టి జయంత్యుత్సవముల నెన్నిటినో గావించుకొనునట్లు "గృహలక్ష్మి"ని శ్రీ భగవాను డాశీర్వదించుగాక. ప్రసాద మిందుంచితిమి. భగవానుడును భక్తులును సురక్షితులు.

## శ్రీ పిఠాపురం రాజకుమారుడుగారు

కార్యాంతరముల అవసరమున రాజాలక చింతిల్లుచున్నాను. ఉత్సవము జయప్రదమగుగాక.

## శ్రీ సి. ఆర్. పట్టాభి రామన్ గారు

ఈ ఉత్సవము జయప్రదముగా నెరవేర గోరుదును. "గృహలక్ష్మి" పత్రిక కభివృద్ధి నాశింతును.

## శ్రీ బి. వి. గుండప్పగారు, బెంగుళూరు

కంకణము మీ కిచ్చుట (నాగరత్నంగారికి) మాకు సంతోషకరము. మీది చాల దృఢమైనభక్తి. మీ దృఢభక్తి మా వంటి వారినికూడ భక్తి పరుల నొనర్చుటకు మేలుబంతిగానున్నది. మాకు ఈ గౌరవము జరుగుచున్న కాలమున మీరును మిమ్ము గౌరవించుచున్న శ్రీ కేసరిగారును చిరంజీవులై ఇతోధిక గౌరవము గల్గి శ్రీ త్యాగరాజసేవ గావింపుచుండ మేము చూచి సంతోషింపగోరుచున్నాము.

## సందేశములు



**తిరువాయూరు మహిళాసంఘమునకు చెందిన శ్రీమతులు భాగీరథి, జానకమ్మాళ్, శివపార్వతి, మధురాంబాళ్, కుంజమ్మాళ్, శకుంతలా సీతారామన్, కమలమ్మగార్లు కలిసి శ్రీ నాగరత్నంగారి కంపిన సందేశం: —**

ఇచ్చినవారి కిచ్చినంత చేకూరును. మీకు స్వర్ణకంకణ మివ్వడం మాకు సంతోషము. శ్రీరామ కృష్ణాది దేవుళ్లనుగూర్చి విన్నాముకాని వారిని కళ్లార ఎవ్వరున్నూ చూడలేదు. వారిభక్తులు శ్రీ త్యాగరాజు వారిని చూచిన వారుండిరి. కాని వారి భక్తి విశేషములను, వారికి వారికి భక్తులైన మీవల్ల ప్రత్యక్షముగ చూడగలుగుచున్నాము. అట్టి మిమ్ములను వెతికి ఈ కంకణమును పెద్దలు శ్రీ కేసరిగారివ్వ బూనడం, నిండా సంతోషదాయకము. గృహలక్ష్మి వర్ధిల్లుగాక.

### శ్రీ వంగోలు వెంకట రంగయ్యపంతులుగారు

ఈ కంకణ బహూకరణము స్త్రీ జన ప్రజ్ఞా విజ్ఞానముల నుత్తేజింప జేయుచున్నదని కడుంగడు సంతోషించెద. ఆంధ్ర స్త్రీలోకోద్ధరణము నెడల తమ త్యాగశీలతయు, తాము నెరపుచుండు ఆదరాభి నివేశములును గుప్తములయ్యు స్వయం ప్రకాశములయి వెలుంగుచు అత్యంతమగు లోకోప కృతికి దోహదము చేయుచున్నవి.

### దేశిరాజు భారతీదేవిగారు

ఇప్పట్టున శ్రీమతి బెంగుళూరు నాగరత్నముగారికి కంకణ ప్రదాన మొసంగి గౌరవించుచున్నందుకు పాత్రమెరిగి దానమొసంగుటలో తాము సిద్ధహస్తులని విదితమగుచున్నది. సంగీత సాహిత్యము లామె సొమ్ములు. ఇది వరలో కంకణ గృహీతలందరును కవయిత్రులుగా రాణించినారు. యీమె యట్లుగాక సంగీత శాస్త్రమునగూడ ప్రజ్ఞావంతురాలు. ఇట్టి విదుషీమణికి రెండు కంకణము లొసంగినను యొసంగ వచ్చునేమో? స్త్రీజన యజ్ఞానాంధకారమును బోగొట్టు జ్ఞానజ్యోతియై గృహలక్ష్మి వర్ధిల్లుగాక.

### శ్రీ కే. యం. కృష్ణమూర్తిగారు బి. ఏ. బి. ఎల్. నెల్లూరు.

తమ ఆహ్వానపత్రికనుబట్టి కంకణప్రదానము శ్రీమతి బెంగుళూరు నాగరత్నమ్మగారికి తమచే జరుగ నున్నదని అభిప్రాయపడితిని. తమరి ఈ విశాలహృదయపూరితమగు ప్రదానము మిక్కిలి ఘనము.

విదుషీమణి శ్రీమతి బెంగుళూరు నాగరత్నమ్మగారిని మాతృతుల్యగా గౌరవింపుచున్న వారిలో నే నొకడను. మదమత్సరపూరితమగు ఈ కాలపు ప్రపంచమున అట్టి త్యాగినులుండుటే - మన వంటివారికి ఆదర్శప్రాయమునూ, ఉత్సాహపూరితమునూ - అని నా యభిప్రాయము.

ఇంకను, రాయలసీమ, అమరజ్యోతి, ఆదిశైవ పత్రికలసంపాదకులును, జెమినీపిక్చర్స్ సర్క్యూట్ వారున్నూ, బందరునుండి ఇ. లక్ష్మీవతి బి. ఏ. బి. ఎల్ గారున్నూ తమ శుభసందేశములనంపిరి.



విద్యాసుందరి, గానకళావిశారద శ్రీమతి బెంగుళూరు నాగరత్నమ్మగారికి
కేసరీవిద్యాలయసందర్శన శుభాగమన సమయమున బాలబాలికలు సమర్పించిన

# సన్మాన పత్రము ★ పద్యరత్నములు

ప్రాచీన కాలమునుండి లలితకళలకు బేరొందిన దాంధ్రమాత. ఆమె కనుంగుబిడ్డ యగు నీమె ప్రధాన లలితకళయగు గానకళకు యుక్తబాల్యముననే తావలంబగుట యెంతయు ప్రశంసనీయము. కేవల సంగీత పటిమతో, దనివినంది యుపేక్షసేయక సంస్కృతాంధ్ర సాహితీ పరిజ్ఞానమును జూఱగొని ద్వితీయ సరస్వతిగా నవతరించిన దనుటలో నిసుమంతయు సందియములేదు. ఆత్మీయ జ్ఞాన గాన కాంతుల నలుదిక్కుల వెదజల్లి శ్రోతల మనముల నాకర్షించి యనేక ప్రశంసల బడసిన దీక్షాదక్షీరత్నము. నాదబ్రహ్మయగు త్యాగరాజునకు ప్రశిష్యత్వంబు నెఱపి గాంధర్వ కళాదేవత నారాధించి శ్రీ త్యాగరాజ గురు సేవకై సర్వము త్యాగము గావించుచు, జీవితమును సార్థకము చేసుకొనుచున్న - ఈ ఆంధ్రయోషారత్నము నేడు ఈ విద్యాలయమునకు విచ్చేసి మా బాలబాలికలను సంతసింప జేసినందులకు అనేక ధన్యవాదములు సమర్పించుచుంటిమి.

చెన్నపురి<br>9.3.49

ఇట్లు<br>**బాలబాలికా సంఘము**<br>కేసరీ విద్యాలయము.



సుదినము నేడు స్వాగతము శోభిలుగాక సదా భవత్కృతం<br>
బది పదియంతలై పరగి యాంధ్రసతీమణి సన్నుతంబునై<br>
సదమల కీర్తిచంద్రికలఁ జల్లెడు, సద్వినియోగతృప్త శ్రీ<br>
సుదతి యొసంగు మీకు చిరసౌఖ్య సుజీవన మోక్షసంపదల్.

విత్తార్జనమునకు వివిధ సద్వినియోగ మొదవిన ఫలమని మొనసి వీరు<br>
దానంబులను జ్ఞాన దానమెక్కుడు గాగ చింతించి గృహలక్ష్మి స్త్రీలకొసగి<br>
బాలబాలికలకుఁ బాఠశాలలఁ గూర్చి కేసరి యనుపేరఁ గీర్తిగాంచె,<br>
ప్రతివత్సరంబును ప్రజ్ఞావతుల గూర్చి స్వర్ణకంకణమున సత్కరింత్రు,<br>
నాగరత్నంబు నీసారి బాగుమీఱ కంకణంబున వెలసెను కరము గుణము<br>
రత్నహేమంబులును గూడ నూత్నశోభ రంజిలుంగాదె రేఁడును, రసికకృతము.

గాంధర్వమున వాసి గాంచిన బెంగ్లూరు నాగరత్న మనెడి నారి యీమె,<br>
పాండిత్యము గడించి పరమ పావనమైన సుజ్ఞాన నిధిగను స్తుతులఁ బడసె.

నాదంబుపాసించి నళినాయతాక్షుని గనుమార్గదర్శకు గానమూర్తి
త్యాగరాజుని భక్తిం దారకమును నేర్చి సర్వంబు నర్పించి సంతసించె
శిష్టకాలంబు ద్రోయు విశిష్ట చరిత త్యాగమూర్తిని ధ్యానింప త్యాగబుద్ధి
కుదరకుండునె, జ్ఞానంబు కులము గోత్రములను గానక యాదర్శములుగజేయు.

పండితబృంద మార యను పద్ధతి గాన కళా విలాసముల్
వెండియు భక్తిమార్గ శుభ వేదితమా పరతత్త్వ బోధయున్
నిండుగ జేయు యోగ్యతల నేర్చిన నీవు సుధీ ప్రశస్తవై
దండిగ బాలశాలకును దానముచేయుట సాజమేగదా.

కేసరి విద్యాలయముల యాసదసింతో ముదంబు నేపునమీరగ
వాసిగవిద్యాసుందరి కీ సన్మానంబుజేయు, సన్మతిగొనుమా.

---

ఎన్నో ఏండ్లక్రిందట, సరోజినిని బ్రిటిష్ విశ్వవిద్యాలయంలో విద్యార్థినిగా చూచిన గోకలే నా కామెనుగూర్చి చాలా గొప్పగా వర్ణించి చెప్పాడు. అట్లా చెప్పడం సామాన్యంగా ఆయన స్వభావంకాదు. ఆమె రెండవతోరూడత్తు అన్నాడాయన.

ఎమ్. ఆర్. జయకర్.

దివ్యశక్తియొక్క ఉగ్రమూర్తి రుద్రకాళి; ప్రసన్నమూర్తి భద్రకాళి. శ్రీమతి సరోజిని భూమిమీద వెలిసిన ఆ రెంటియొక్క అవతారము.

డా. పట్టాభి.

శ్రీమతి సరోజినీదేవి తన జీవిత క్రమంలో స్త్రీలెంత ఔన్నత్యానికి రాగలరో నిరూపించినది.

శ్రీ శ్రీ శ్రీ భావనగర్ మహారాణిగారు

నా ప్రియసోదరి, నెచ్చెలి, సాటిదేశసేవిక, మనల నందరిని శాశ్వతంగా విడిచి పోయినది. ఎక్కడికి వెళ్లినా కరుణ, శాంతి, సుహృద్భావాలను వెంటగొని వెళ్లినది. ఈ దేశంలోను విదేశాలలోను ప్రతి వాళ్లనూ తెలుసు. ప్రపంచంలో ఎవరితోనైనా వాదించగలదు; వేళాకోళం చేయగలదు; ఎవరినైనా దండించగలదు. ఆమె చేయగల్గినపని తాను చేయగలనని మరెవ్వరూ ఆశించజాలరు. —రాజాజీ



ఆమె మా అమ్మకు, నా భర్తకు, నాకుకూడా మంచి స్నేహితురాలు.
ఆమె మృతి జాతీయనష్టమే కాదు ; అంతర్జాతీయనష్టము కూడ.

మౌంట్‌బాటన్ సతి.

ఉండు! మృత్యుదేవతా !! ఉండు !!!
ఉండు! కొంతకాలమట్టె, ఉండు !!
అప్పుడె, నే నెట్లా మరణించేదీ—?

పూపప్రాయపు ఆశలవన్నీ పూర్తిగతీరాయా ?
నా ఆనందపు రాసులు గాదుల నింపానా ?
మనసారగ నా మధుర గీతికల నాలాపించానా?
జిలజిల ఊరే అశ్రువులన్నీ జలజల రాల్చానా ?

ఉండు ! మృత్యుదేవతా !! ఉండు !!!
ఉండు ! కొంతకాలమట్టె, ఉండు !!
అప్పుడె, నే నెట్లా మరణించేదీ ?

మూలం : ఆంగ్లం.
అనువాదం : వెం.

సరోజినీదేవి.

శ్రీమతి ముత్యాల సరోజినీదేవి దివ్యపథాన స్వర్గధామం చేరింది. అప్సరస లందరూ ఆట పాటలతో ఎదురేగి హారాలువేసి, హారతులిచ్చి, ఆహ్వానించారు. 'ఆకలి దప్పికలు, ఆహారసమస్యలేని ఈస్వర్గమేమి టి సీ!' అని వారితో హాస్యా లాడుతున్నదామె.

"33 సll ల నాడు కాంగ్రెసు సభావేదికనుండి ఆమె వాణివిన్నాను; నాఒళ్లు గగుర్పొడిచింది. అప్పటినుంచీ ఎప్పుడువిన్నా నాకు ఒళ్లు పులకరించేది" అంటు న్నాడు సహజోద్రేకి మన ప్రధాని నెహ్రూ. "45 సంll నాడు, దాదాభాయి అధ్యక్షతవహించిన కాంగ్రెసు వేదికపై సరోజినీదేవి మాట్లాడగా విద్యార్థినై ఉండి విన్నాను. ఆవినికిడే నాజీవితాన్ని రూపించింది." అంటున్నాడు పరమశాంత మూర్తి బాబూ రాజేంద్ర ప్రసాద్. "ఆమె ఒకగదిలోకిగాని సభలోకిగాని వచ్చిందంటే లక్షజ్యోతులు ఒక్కసారి ఘప్పున వెలిగినట్లుండేది" — అని అంటు న్నాడు పటేలు. అంటే, శిలావిగ్రహాన్నికూడా, ఆమె సందర్శనము చక్కిలి గింతపెట్టగలేది అన్నమాట. అంతంత లేసి వారిసంగతలా వున్నప్పుడు, మరి ఎందరు సామాన్య రాజకీయ నాయకులకు, రాజకీయ జీవితం సాగించను, ఆచల్లనితల్లి దేశభక్తి ఉగ్గుపోసిందో! భారతీయ రాజకీయాకాశాన వెల్గుచు, మారుమూలలకు కూడా వెల్తురిచ్చిన ఉజ్వలతార - కాలంతీరి రాలిపోయింది.

ఆమె ఒక్కరాజకీయవేత్తే కాదు. విదుషీమణి ; కవయిత్రి ; గాయకి; కళా వేత్త; వాగ్మి ; సంభాషణాచతుర ; పరిపాలనా సమర్థ; స్త్రీయుద్యమ ప్రారంభకు రాలు; శాంతిప్రియ ; సర్వప్రియ.

ఆమె ఒక్క జాతీయరంగములోనేకాదు ; అంతర్జాతీయ రంగంలోను - చిర కాలంనుంచీ పనిచేస్తున్న ప్రథమనారీమణి. ఇంగ్లాండు, దక్షిణాఫ్రికా, కెన్యా, అమెరికా అన్నిరంగాలలోను పని చేసినది. రష్యా మిత్రవర్గానికామె అధ్యక్షురాలు.

ఆమె మరణం ముఖ్యంగా ఆంధ్రులకు స్వీయదుఃఖం. ఆంధ్రమాత గృహాం గణమునుంచీ ఒకపెద్దకోడలు, పుట్టెడు పసుపుకుంకుమతో, లక్ష్మీవారంనాడు పరలోకానికి తరలిపోయినది.

ఎప్పుడో కొంతకాలంక్రిందట - ఆమె మృత్యువునుగూర్చి ఆంగ్లభాషలో ఒకగీతం వ్రాశినదని సర్. సి. పి. గారన్నారు. అయితే ఆమె నేటికి ఆ అవసరా లన్నీ, తీర్చుకొనే మరణించిందా? ఇంతకూ అవి ఆమెస్వంత అవసరాలా? కాదు; తనజాతికొరకు, మానవజాతి కొరకు, ఆమె అవలంబించి, అనుభవించినవి.

ఆమె దుఃఖం నిజానికి అందరినీ అలుముకొన్నదే. ఇందులో ఎవ్వరెవ్వరిని ఏమని, ఓదారుస్తారు? అయినా, లాంఛనం - మేజరు గోవిందరాజులు నాయుడు గారిని, వారికుమార్తెను, కొడుకును "గృహలక్ష్మి" ఓదారుస్తున్నది.

సరోజినీదేవిగారి ఆత్మకు శాంతిగల్గుగాక.

ఉత్తరం వ్రాయాలంటే కవర 0-2-0; ఆమె ధరించే మామూలు పట్టుచీరెలపై పన్ను; నిత్యమామె చేయిజారి పడిపగిలిపోయే పింగాణిమీద పన్ను. తమలపాకు వేసుకుందామంటే వక్కలమీద పన్ను. చక్కెరమీద పన్ను. వారిని తలదన్నినవారు-మద్రాసు ప్రభుత్వమువారు-నిత్యము వంటయింట్లో ఉపయోగించే వస్తువులు కొబ్బరికాయలు, నూనె (గింజలు), చక్కెర, బెల్లం టీ, కాఫీ, (చెరకు), మిరపకాయలు, బంగాళాదుంపలు, మిరియము, అరటిపండ్లు - ఈపన్నులన్నీ ఒక యెత్తు; పసుపుమీద పన్ను ఒకయెత్తు. పసుపుతోనే కుంకుమ చేసేది. గృహలక్ష్ములకు పసుపు కుంకుమలు కొరవచేయడం దారుణము; మహాదారుణం. అదీ పసుపు పెట్టెలో ఓట్లు వేయించుకున్నవారు! ఈ విషయము బడ్జెట్‌చర్చసమయాన ప్రస్తావించిన శ్రీమతి అమ్మన్న రాజాగారి కళివందనాలు. అయితే, సంపాదించేపురుషుడికిగదా ఈ భారం అంటారేమో! అవతలేమీ చేయలేకపోయినా, "అప్పుడే అయిపోయినవా?" అని ఇల్లాలిమీదగదా ఆయనచేసే కారుబారంతా!

---

మరదలు—ఆనుపడుచును ప్రశంసించుట

సరోజినీదేవి ఎన్నోరంగాలలో పాత్రవహించినది. అన్నిటా 'సెబాస్'-అనిపించుకున్నది. లక్నోలో ప్రభుత్వభవనమందు ఆమె వ్యక్తిత్వము మూర్తివంతమై తాండవిస్తూంటుంది. స్తబ్ధుగాను, నిస్తేజముగాను ఒక క్రమంలో పనులు సాగిపోతూంటే ప్రభుత్వ భవనంలో కూడా విసుకువేసట తగ్గించవచ్చు; ఉక్కిరి బిక్కిరి లాడే అక్కడ అందచందములచేత హాయి చేకూర్చవచ్చును; దాని వంటరితనాన్ని, స్నేహంచేతను, అతిధిసత్కారముచేతను బాపవచ్చును; హాసోల్లాసములతో అచట భయంకరమగు విషాదచ్ఛాయల చెదరగొట్టవచ్చును - అని ఆమె నిరూపించినది.

కమలాదేవి చటోపాధ్యాయ

---

# పసిపిల్లల లివర్, స్ప్లీను వ్యాధులకు అమోఘ ఔషధము.



పసిపిల్లల లివరు, స్ప్లీను వ్యాధులను కుదుర్చుటలో జమ్మి వారి "లివర్ క్యూరు" అత్యవసరమైనది గనుకనూ, జగద్విఖ్యాత మైనది గనుకనూ, వైద్యశాస్త్రానికి మహా అక్కరయినది.

బహుక్లిష్టమైన లివరు, స్ప్లీను వ్యాధులందు ఇది దివ్యతరంగా అనుకూలించినది. ఈ జమ్మి వారి "లివర్ క్యూరు" గురించి ఇండియా యంతటనూ వైద్యప్రముఖులు అభివందనాలు తెల్పుచున్నారు.



**జమ్మివారి**

## లివర్ క్యూర్

అన్నిచోట్లా దొరకును

జమ్మి వెంకటరమణయ్య అండ్ సన్సు,
మైలాపూరు, మద్రాసు, ఫోన్ నం|| 8139
ఇతరచోట్లు: బెజవాడ, విజయనగరం కలకత్తా, బొంబాయి, లక్నో, బెంగుళూరు, తిరుచునాపల్లి, etc

పూచీగల

# మరకలుపడని ఉక్కు సామగ్రి




మరకలుం పడవు, ఎల్లప్పుడు ప్రకాశవంతముగ నుండును. చౌకధనమునకు. నాణెము కు ప్రసిద్ధిచెందినవి.

కప్పులు, సైజువారి గిన్నెలు, గరిటెలు, లోటాలు, డబరాగిన్నెలు, టిఫిన్ కారియర్లు, కాఫీఫిల్టర్లు, పళ్లెములు, పచ్చడిగిన్నెల సెట్లు, జల్లిపాత్రలు, గరిటెలు మొదలగు గృహోపయుక్తములగు సామాను, హోటళ్లకు కావలసినవి దొరకును.

దయచేసి వకసారి
కార్యాలయమునకు వచ్చిచూడుడు.

(1) 498, మింటుస్ట్రీటు, మద్రాసు 3 & మెట్టూరు డ్యాం.
(2) 22/522 బిగ్ బజారుస్ట్రీట్, కోయంబత్తూరు.
(3) No. 169/1429 - 30 మెయిన్ రోడ్, కారుస్టాండు సమీపమున, షేవాపేట-సేలం.
(4) శ్రీ అగస్త్య ఏజన్సీస్. నెం. 67 సవుత్ కార్ స్ట్రీటు, చిదంబరము.
(5) ఇండస్ట్రియల్ సర్వీసస్. 12 A. మీనాక్షి కోయిలు స్ట్రీట్, (తూర్పు చిత్రాస్ట్రీటు, సవుత్ ఎక్స్టెన్షన్,) మధుర.
(6) ది కన్నడ కమెర్షియల్ కార్పొరేషన్ లిమిటెడ్, 61. టాంకు బండ్ రోడ్డు, రామకృష్ణపురము, బెంగుళూరు సి టి.

చిల్లరవర్తకు లందరివద్దను ఇవే ఇత్తడి పాత్రసామానులుంకూడ దొరకును.

ఇండియన్ మెటల్ & మెటల్లర్జికల్
కార్పొరేషన్.
498. మింటుస్ట్రీటు, మద్రాసు 3.

# సంపాదకీయములు

## కొడుక్కు అన్నం పెట్టడం తల్లికి తప్పా?

నేడు ప్రభుత్వాలు ప్రజాక్షేమానికి శత్రువులైన రాజకీయకక్షలవారిపై సాగిస్తూన్న నిర్బంధవిధానాన్ని ప్రశ్నించుపాటివారము కాము. అయితే ఆ నిర్బంధవిధానము మానవత్వానికి వెలియైనప్పుడు తప్పకుండా ప్రశ్నించకోరుతున్నాము. మలబారులో ఒక కమ్యూనిస్టుయువకుణ్ణి ప్రభుత్వం పట్టుకోదలచింది. ఆయువకుడు తల్లిచాటున చేరాడట. ఆమె కన్నకొడుక్కు అన్నంపెట్టిఆదరించినది. అందుకామె నేరస్థురాలని - 5 నె॥లు కఠినశిక్ష వేశారు. ఎంత బ్రహ్మరాక్షసిఅయినా - కన్నకొడుక్కు అన్నంపెట్టడం, పెట్టకపోవడంఅనేది ఇంకా ఆవ్యక్తియందు మానవత్వం ఉన్నదా, లేదా అనేందుకు తుదిపరీక్ష. వెనుక సత్యాగ్రహములలో జూల అన్నదానంచేసినవారినికూడా శిక్షించారనే మనమంతా గగ్గోలుపెట్టాము. అతడు దుర్మార్గుడనేది ప్రశ్నకాదు. అతడు తల్లివాత్సల్యానికికూడా వెలిగాడు; కారాదు. ఆమె వాత్సల్యానికిమించి కమ్యూనిస్టుపార్టీ కార్యక్రమానికి తోడ్పడిఉంటే అందుకని శిక్షించవచ్చు. వెనుక మొదటి ప్రపంచ యుద్ధంలో - ఒకదాది - యుద్ధంలోనుండి భయోత్పాతంచేత పారిపోయివచ్చిన వ్రణితులగు సైనికులను రహస్యంగా ఆదరించి కాపాడింది. అట్లా పారిపోవడం, కాపాడడంకూడ నేరములే! అందుకామెను ఫిరంగివాత వేశారు. ఫిరంగివాతపడుతూ ఆమె అన్నమాటలివి: "కేవలం దేశభక్తిచాలదు; మానవత్వంకూడా ఉండాలి." గాంధీతత్వం అదికాకపోతే మరేమిటి?

## శ్రీ నాగరత్నంగారి దూరదృష్టి

శ్రీమతి నాగరత్నంగారు, కేసరిగారుతమకిచ్చిన గృహలక్ష్మీస్వర్ణకంకణాన్ని, శ్రీ కేసరీకన్యావిద్యాలయంలోనే నిక్షేపించిఉంచడం ఆమె దూరదృష్టి, వివేకం తెలుపుతున్నవి. వెనుక శ్రీ కోడిరామమూర్తిగారు ప్రపంచమంతాతిరిగి బలప్రదర్శనానికి బంగారుపతకాలు, రజితపాత్రలు, కనకకంకణాలు ఎన్నో బహుమానం పొందారు. శతావధాని వేమూరి శ్రీరామశాస్త్రిగారు యావద్భారతదేశంలో సంస్కృతంలో అవధానాలుచేసి ఎన్నో స్వర్ణపతకాలు, శాలువలు పొందినారు. శ్రీ హరిప్రసాదరావు, ముప్పిడి జగ్గరాజు, బళ్లారి రాఘవాచారి, యడవల్లి సూర్యనారాయణప్రభృతులైన నటులెన్నో పతకాలుపొందియుండిరి. ఇంకా ఎందరెందరో వారివారి విద్యలకు నైపుణ్యములకు బహూకృతులందినారు. అవన్నీ ఏమైనవి? అవి దేశీయసంపదకుచెందినవికావా? వదాన్యులు, సంస్థలు వానిని సకాలమునకొని శాశ్వతసంస్థలలో నిక్షేపించవలయునని మా అభిప్రాయము. గాంధీ దూష్యములని తిరగగొట్టిన పతకాలకై నేడు దేవులాడుతున్నాముకదా. గృహీతలే దూరదృష్టితో అట్లుగావించడం హర్షదాయకం. గత సం॥ము లక్ష్మీబాయమ్మగారుదాన్ని శారదానికేతనంలో నిక్షేపించారు; ఈ సారి నాగరత్నంగారిట్లా చేశారు. ఈవిధంగా ఈ కంకణానికి శాశ్వతస్థితి కల్పించినందుకు వీరికి కృతజ్ఞులము.

## క్రొత్త పన్నులు

భారత యూనియన్ ప్రభుత్వమున్నూ మద్రాసు ప్రభుత్వమున్నూ, క్రొత్త సం॥పు ఆయవ్యయ పట్టికలలో క్రొత్త పన్నులు సూచించారు. ఈ పన్నులొక్కసారి పారచూస్తే కేవలం గృహలక్ష్మిమీద ఈ భారమంతా పడుచున్నదని తోచకపోదు. యూనియన్ వారువేసిన పన్నులు: పుట్టింటకి గోప్యంగా




**చేనేత పరిశ్రమ రక్షణ మార్గాలు : పెండెం వెంకట్రాముడు, పారిశ్రామిక గ్రంథమాల, పేరాల, చీరాల పోస్టు వెల 0-8-0**

చేనేత వృత్తికిచెంది చిరకాలంనుంచీ ఆ పరిశ్రమాభివృద్ధికై పాటుపడుచున్న శ్రీ పెండెం వెంకట్రాములుగారీ చిన్నగ్రంథం వ్రాశారు. నిజానికి నిత్యం గృహకృత్యాలు చేసుకోవలసిన 'గృహలక్ష్మి'-గట్టివైన చేనేత చీరలనే కోరతుంది. చేనేత చీరెలలోనే అందం ఉంది; నేసే మనిషి తన బుద్ధిని ప్రతిపోగును సర్దడంలో ఉపయోగించడమే అందుకు కారణం. మరిన్నీ ఈ పరిశ్రమయే లక్షలాది ఇల్లాండ్రను ఇల్లు వదలకుండా భర్తలకు తోడ్పడి కుటుంబాదాయం వృద్ధిచేయడాని కుపయోగపడేది. కాబట్టి ఈ గ్రంథం స్త్రీపురుషులందరు చదువదగినది.

**తెనుఁగుసీమ; జయలక్ష్మి, అండుకో, నెల్లూరు. వెల. 0-14-0 లు.**

తెనుగు సీమలో పుట్టిన చేవగల వారిలో ఖడ్గతిక్కన, రుద్రమదేవి, పోతన ఉత్తములు. వారి ముగ్గురి జీవితములు చక్కని గ్రాంధిక శైలిలో వచనముగా నీ గ్రంథమున వ్రాయబడినవి. ఇది పాఠ్యగ్రంథముగాకూడ అంగీకరింపబడినది. గ్రంధకర్త శ్రీ ఉభయభాషా ప్రవీణజంధ్యాల పాపయ్యశాస్త్రిగారు.

**సతీదేవి : నాళం అప్పల నరసింహంగారు ; రాజమహేంద్రవరము-వెల రు. 0-12-0 లు.**

ఈ వచన గ్రంథము 1915 లోనే వ్రాయబడినది. దీనికి శ్రీ దేశభక్త కొండ వెంకటప్పయ్య పంతులుంగారు పీఠికను వ్రాసిరి. ఆ రోజులలో పంతులవారిశైలి చూడవలెనంటే ఇది చదివితేచాలు. గ్రంధమునంతయు జిగిబిగిగల్గిన సరళమగు గ్రాంధిక భాషయందు శ్రీ నాళం అప్పల నరసింహంగారు వ్రాసియున్నారు. ఇందలి ఇతివృత్తము దాక్షాయణి దక్షయజ్ఞకుండమున ఆహుతి యగుట. ఈ గ్రంథము ఆ రోజులలోనే బడులలో పాఠ్య గ్రంథముగా అంగీకరింపబడినది.

## శ్రీ సర్వధారినామ సం॥ర ఫాల్గుణ విరోధినామ సం॥ర చైత్ర, మాసములు

మార్చి 1949-వ సం॥

| | | |
|---|---|---|
| 16 | బు | ది 35-11 హ 21-27 రా 10-11. |
| 17 | గు | త 29-59 చి 17-3 ఉభా 1-సంకష్టహరణ గణేశవ్రతం. |
| 18 | శు | చ 24-51 స్వా 14-2 వి 27-2 వ్యాసరాయపుణ్యదినం. |
| 19 | శ | పం 20-3 ష 10-11 తిథి ద్వయం గోరంట్ల మాధవస్వామి రథోత్సవం. |
| 20 | ఆ | స 16 21 అను 9-19 వ 16-31 సప్తమీతిథిః. |
| 21 | సో | అ 13-51 జ్యే 8-9 వ్య 48-6. |
| 22 | మం | న 12-14 మూ 8 7 వి 4-7 |
| 23 | బు | ద 12-2 పూషా. 9-29 రాం. 14-షడశీతిముఖం. |
| 24 | గు | ఏ 13-2 ఉషా. 12.4 ఉభా. ఏః |
| 25 | శు | ఏ 15-14 శ్ర 15-42 సర్వేషాం పాపవిమోచినైకాదశీ. |
| 26 | శ | ద్వా 18-30 ధ 20-32 త్రయోదశీతిథిః. |
| 27 | ఆ | త్ర 22-48 శత 26-3 శుభ 41-0 శూన్యతిథిః మాసశివరాత్రిః. |
| 28 | సో | చతు 28-3 పూభా. 32-41 రా 29-1 చతుర్దశీతిథిః. |
| 29 | మం | అమా ● 33-27 ఉభా. 39-20 అమాతర్పణం పిండపితృయజ్ఞం. |

### విరోధినామసంవత్సర చైత్రమాసము.

ఏప్రిల్ 49

| | | |
|---|---|---|
| 30 | బు | శుక్లపా 38-27 రే. 55-36 నూతనసంవత్సరాదిః వసంత నవరాత్రారంభం. |
| 31 | గు | వి 46-29 రా 12-45 అ 56-59 చంద్రోదయం. |
| 1 | శు | త 51-33 రా 2-45 భ 60-0 పా 3-29 గౌరితదియ, మత్స్యజయంతి. |
| 2 | శ | చ 55-42 భ 2-53 రా 8-22, 10-6. |
| 3 | ఆ | పం. 58-41 తె 5-35 కృ 2-53 ఉ 7-16 రా 8-22-10-6. |
| 4 | సో | ష 60-0 రో 12-6 ప 10-56 సా. 8-48-6-28 స్కందపూజ. |
| 5 | మ | షం 2-5 మృ 14-43. |
| 6 | బు | స 0-47 ఉ 6-23 ఆర్ద్ర 15-50 ప 12-54 సూర్యపూజ అశోకాష్టమి |
| 7 | గు | న 56-30 పున 15-38 ప 12-18 శ్రీరామనవమి. |
| 8 | శు | ద 51-52 పుష్య 13-21 ప 11-23 |
| 9 | శ | ఏ 45-26 ఆశ్లే ఏకాదశి. |
| 10 | ఆ | ద్వా 37-53 రా 9-11. |
| 11 | సో | త్ర 29-15 సా 5-43 రా 2-15. |
| 12 | మం | చతుర్దశి 19-12 ప 1-42 రా 11-19 చంద్రపూజ తిథిద్వయం. |
| 13 | బు | ○ పౌ 9-34 ప 9 51 చి 35-24. |
| 14 | గు | బ పా 0-10 ఉ 6-4 స్వా 28-30 చైత్రకృష్ణపక్షం. |
| 15 | శు | త 44-17 రా 11-42. |

Printed and Published by Dr. S. Seshagiri Rao at the Lodhra Press, Kesari Kuteeram Ltd,
15, Westcott Road, Royapettah, Madras. Editor : Dr. K. N Kesari

కొలది ప్రతులుమాత్రమేకలవు — త్వరపడుడు

# బిల్వ, వేప

బిల్వ వేప అను జాతీయమూలికలనుగూర్చి శాస్త్రవిషయక పరిశ్రమచేసి వ్రాయబడిన ఉత్తమ గ్రంథరాజములు. ఈ మూలికల ఓషధిగుణము, వైద్యప్రయోగములు, శాస్త్రచర్చ, పురాణ వివరము, సరళశైలిలో వివరింపబడినవి. వైద్యులకు, భక్తులకు మిక్కిలి ఉపయోగకరమైన గ్రంథములు. క్రౌనుసైజున మంచి ఫెదరువైటు కాగితములమీద ముద్రింపబడి గృహలక్ష్మి గ్రంథమాలలో ద్వితీయ తృతీయ కుసుమములుగా ప్రచురింపబడినవి.

గ్రంథకర్త : కె. యన్. కేసరి — ప్రతి 1-కి 0-12-0

గృహలక్ష్మి కార్యాలయము
రాయపేట :: మద్రాసు

# ఏజంట్లు కావలయును.

"గృహలక్ష్మి" మాసపత్రికలు విక్రయించుటకు - చందాదార్లను చేర్పించుటకు ఈ దిగువ స్థలములలో ఏజంట్లు కావలయును

సోంపేట; పాలకొండ; బొబ్బిలి; సాలూరు; కందుకూరు; గిద్దలూరు; కంభం; నర్సారావుపేట; పాలకొల్లు; అమలాపురం; జగ్గయ్యపేట; రాజోలు; ఆముదాలవలస; కైకలూరు; గనపూరు; మండపేట; తిరుపతి; ధర్మవరం; సూళ్లూరుపేట; గూడూరు; బుచ్చిరెడ్డిపాళెం; కోట, వేటపాలెము; చేబ్రోలు; సామర్లకోట; పెద్దాపురము; కొల్లూరు; భట్టిప్రోలు; రేపల్లె; కాళహస్తి; వెంకటగిరి; పాకాల; ద్రోణాచలము; ప్రొద్దుటూరు; హోస్‌పేట; జబ్బల్‌పూరు.

వివరములకు:

గృహలక్ష్మి కార్యాలయము,
15, వెస్టుకాట్ రోడ్డు, రాయపేట, మద్రాసు.

